

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

వెల 4 అణాలు ANDHRA PATRIKA ILLUSTRATED WEEKLY 31-5-19

# కాగో వెస్లీ మెమోరియల్ ఆస్పత్రి



ాసుప్రాంతీయ సైన్యంలో చేరిన యువకుడు రైఫిల్ ఉపయోగించడం నేర్చుకొనే దృశ్యం.



చికాగో వెస్లీ మెమోరియల్ ఆస్పత్రి.



చికాగోలోని వెస్లీ మెమోరియల్ ఆస్పత్రిలో స్టెరిలైజు చేసిః
చేతి తొడుగులను జాగ్రత్తగా తనిఖీచేస్తున్న అధికారి.

# ఆంధ్రపత్రిక


సంవత్సరచందా
రు. 12-0-0

విడిప్రతిక
4 అణాలు

ప్రతిబుధవారము ప్రకటింపబడును.

ఒరులేయవియొనరించిన నరవర, యప్రియము తనమనంబున కగు దా
నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్
(మహాభారతము)

**Founder : K. NAGESWARA RAO.**

సంపుటము **42**

సంచిక **39**

వికృతి సంవత్సర జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమ బుధవారము




ప్రముఖ ఆంధ్రచిత్రకారుడు శ్రీ చావలి నాగేశ్వరరావుగారు రిపబ్లిక్ అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్‌గారికి వారి తైలవర్ణ చిత్రపటమును ఫిబ్రవరిమాసమున ఢిల్లీ ప్రభుత్వభవనములో సమర్పించారు. రావుగారు చిత్రపటానికి ఎడమవైపున, రాజెన్‌ బాబు కుడివైపున ఉన్నారు.






1950-వ సం॥ మేనెల 31-వ తేది బుధవారము

# కాంగ్రెస్ పంచాయితీ ఎన్నికలు

కాంగ్రెసు ప్రాథమిక పంచాయతీ ఎన్నికల సందర్భమున రాష్ట్రములో పలుచోట్ల జరిగిన సంఘటనలు కాంగ్రెసువాదులకుగాని, కాంగ్రెసు సంఘములకు గాని ఏమాత్రము గౌరవప్రదముగ లేవు. కొన్ని ప్రాంతములందు నామినేషను పత్రముల తిరస్కరణ జరిగినది. మరికొన్ని ప్రాంతములందు వోటరుల జాబితాలు ఎన్నికలలో పాల్గొనుచున్న వారందరికి అందుబాటులో లేవు. కొంతమంది రిటర్నింగ్ ఆఫీసరులపై అభ్యర్థులు తీవ్రమైన ఆరోపణలు చేసిరి. పల్నాడు తాలూకాయందు, కారణ మేమైనప్పటికిని, దాదాపు అరువదివేలమంది సభ్యత్వములు రద్దుచేయబడినవి. 12 సంవత్సరముల క్రితం కృష్ణాజిల్లాలో దాదాపు ఇదేవిధముగ జరిగియుండెను. అప్పటి ఆ సంఘటనను విమర్శించినవారే నేడీ విధముగ చేయుట శోచనీయము. కొన్ని ప్రాంతములందు దౌర్జన్యచర్యలు జరిగినట్లుకూడ వార్తలు వచ్చెను.

కాంగ్రెస్ పంచాయితీ దారులుగ ఎన్నికలకు నిలబడిన అభ్యర్థులు అందరు నూటికి నూరుపాళ్లు కాంగ్రెస్ వాదు లనుటకు వీలులేదు. ఇందనేకమంది అవకాశవాదులు గలరు. ప్రత్యక్షముగగాని, ప్రచ్ఛన్నముగగాని కుల,మత వివక్షతను ప్రోత్సహించినవారు కాంగ్రెస్ సభ్యత్వమునకు అనర్హులైన "కమ్యూనల్ జి. ఓ"ను సమర్థించిన రాష్ట్రప్రభుత్వ వర్గమునకు సంబంధించినవారెవ్వరును అర్హులు గారు. అట్లే ఇతరవర్గములందును కాంగ్రెస్ నియమావళి ప్రకారము ప్రాథమిక సభ్యత్వమునకును అర్హులు కానివారెందరో గలరు. ఇట్టివారందరు కాంగ్రెసు ప్రాథమికసభ్యులగుటే గాక కాంగ్రెసుసంఘములందు అధికారస్థానములను సంపాదించుటకు విశ్వప్రయత్నములు చేయుచుండిరి. కాంగ్రెసు సంఘముపై సంపూర్ణాధికారమును సంపాదించుటె నేడు అన్ని వర్గములవారి లక్ష్యము. ఆ లక్ష్యసాధనకు వారు చేయనిపని లేదు.

రష్యాను పరిపాలించువారు ప్రపంచమునే పరిపాలించుదురని నెపోలియన్ ప్రకటించియుండెను. అట్లే నేడు కాంగ్రెసు సంఘములపై అధికారమును సంపాదించినవారు 1951 ఎన్నికల అనంతరము రాష్ట్రప్రభుత్వమును స్వాధీనము చేసుకొనగలరు - అను నమ్మకము కాంగ్రెసువాదు లందరిలో ప్రబలముగ నున్నది. అట్టియవకాశము లేకున్న నేటి కాంగ్రెసు పంచాయతీఎన్నికలలో ఎవరికిని గౌరవప్రదము కానట్టి, అందరికిని అవమానకరమైనట్టి, ఇన్ని సంఘటనలు సంభవించియుండెడివి గావు.

పరిస్థితులు విషమించి ఎన్నికలు న్యాయముగ, సక్రమముగ జరుగుటకు అవకాశములేని కారణమున గుంటూరు, కృష్ణా, పశ్చిమగోదావరిజిల్లాలందు ప్రాథమిక పంచాయితీఎన్నికలు వాయిదా పడవలసివచ్చెను. కొన్ని ప్రాంతములందు పరిస్థితులు శాంతముగ నున్నట్లు కన్పించినను, చిల్లరపేచీలు ఏవో లేని ఎన్నికే కన్పించుటలేదు. కావలితాలూకాలో ఎన్నికలు నిలుపవలసిందని ఉత్తరువులు జారీ అయినప్పటికిని ఎన్నికలు జరిగిపోవుచున్నవి.

ఇట్టి వాతావరణములో ఎన్నికలు జరిగి, వివిధపక్షముల మధ్య స్పర్థలు, విద్వేషములు పెరిగిన అనంతరము రాష్ట్రకాంగ్రెసునందు ఐకమత్యము సాధించుట ఎవ్వరికిని సాధ్యముగాదు. ఇప్పటికె కాంగ్రెసునందలి వర్గములవలన, కాంగ్రెసువాదులలో

ఏర్పడిన స్పర్థలవల్ల రాష్ట్రరాజకీయములు కలుషిత మగుటయే గాక అభివృద్ధికరమైన కార్యక్రమము అమలు జరుగుటకు అవకాశము లేకుండెను. కమ్యూనిస్టు కృత్యాలు తాత్కాలికముగ కొన్ని ప్రాంతములలో తగ్గినట్లు కన్పించినను, ఈ ఎన్నికల కోలాహలము ముగిసిపోయిన వెంటనే తిరిగి ఉధృతము కావచ్చును. రాష్ట్ర మంతట అన్ని గ్రామములందును ఎన్నికల సంచలనము అధికముగ నుండుటవలన, అన్ని వర్గముల నాయకులు అప్రమత్తులై యుండుటవలన కమ్యూనిస్టులు పూర్వము వలె గ్రామములపై దాడి జరుపుటకు వీలులేకున్నందు వనే ఇవి ప్రస్తుతము తగ్గియుండవచ్చును.

ఈ ఎన్నికలలో మంత్రివర్గముపక్షము వారు రాష్ట్రకాంగ్రెసుపక్షముపైనను, రాష్ట్రకాంగ్రెసు పక్షమువారు మంత్రివర్గపక్షముపైనను చేయుచున్న ఆరోపణలు ఆధారసహితములైనవా టన్నింటిని సమ గ్రముగ విచారించుట యవసరము. కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరిజిల్లాలనుండి వచ్చిన ఫిర్యాదులను విచారించుటకు అఖిలభారతకాంగ్రెసు సంఘము కాంగ్రెసుకార్యవర్గసభ్యుడు శ్రీ గోకుల్భాయ్ భట్ ను నియమించెను. వారి విచారణ పూర్తియగువరకు ఈనాలుగు కాంగ్రెసుజిల్లాలలో ప్రాథమికపంచాయితీ ఎన్నికలను నిలుపుదలచేయవలసిన దని అఖిలభారత కాంగ్రెసుసంఘఎన్నికల ఉపసంఘసభ్యుడు శ్రీ జగ్జీవన్ రామ్ ఆదేశించెను. ఇందువలన దాదాపు పద వేలరూపాయల ఖర్చు దండుగ కానున్నప్పటికిని రాష్ట్రకాంగ్రెసుసంఘము ఇట్టి విచారణకు సమ్మ తించెను. ఇదేవిధముగ ఇతరప్రాంతములందు కూడ సమగ్రవిచారణ జరిపి అన్ని వ్యవహారముల పరిష్కార మునకు ప్రయత్నము జరిగిన వాతావరణము కొంత శాంతింపవచ్చును. సర్దార్ వల్లభాయ్ పటేల్ కు ఆంధ్రనాయకులు చేసిన వాగ్దానమును పాలించి ఐక్య తను సాధించుటకు వేరుమార్గము లేదు. ఎన్నికల పూర్వమే ఇది జరుగవలసియుండెను. అట్లు జరిగి యుండిన రాష్ట్రమునందు కాంగ్రెసుప్రతిష్ఠను భగ్న పరచు ఈవివాదసంఘటనలు జరిగియుండెడివి కావు. ఇప్పటికైనను ఆంధ్రనాయకులు అట్టి ఐక్యతకు కృషి చేయుదురు గాక !

---

# క్రొత్త ఆర్థికమంత్రి

భారతప్రభుత్వ ఆర్థికమంత్రిగ శ్రీ చింతామణి దేశముఖ్ ను నియమించినందుకు ఆర్థిక, వాణిజ్య వర్గములు విశేషసంతృప్తిని వెల్లడించుటలో ఆశ్చర్య పడవలసిన దేమియు లేదు. భారతప్రభుత్వఆర్థికమంత్రి పదవిని నిర్వహించుట కాంగ్రెసేతరుల కెవ్వరికి అంత సులభము గాదని షణ్ముఖంచెట్టి, డాక్టర్ మత్తాయ్ గార్లు ఋజువు చేసిరి. పార్లమెంటులోని కాంగ్రెస్ పక్ష సభ్యులును ఈ కీలకశాఖపై కాంగ్రెసేతరుల యాధి పత్యము కూడ దని చాలాకాలముగ ఆందోళన చేయు చుండిరి.

దేశాదాయముతో నిమిత్తములేక ప్రభుత్వ శాఖలవా రందరు పునర్నిర్మాణపథకముల క్రింద విశేషద్రవ్యమును ఖర్చుచేయుచుండ, దుబారా ఖర్చులు విపరీత మగుచున్నవని ఆర్థికపారిశ్రామిక వర్గములు ఆందోళన చెందుచుండ ఆర్థికమంత్రి డాక్టర్ జాన్ మత్తాయ్ ఈ వ్యయమును తగ్గించుటకు ఉప ప్రధానమంత్రి సర్దార్ పటేల్ సహాయమును అర్థించ వలసివచ్చెను.

దేశము ఆర్థికముగ సౌష్ఠవముగ నున్నగాని ఏ సమస్య పరిష్కారము కాజాలదు. సక్రాగ్గి మోటుముగ ప్రభుత్వ వ్యయమును దేశాదాయమునకు తగినట్లుగ తగ్గించి, ద్రవ్యోల్బణమువలన ఏర్పడిన విషమస్థితిని శీఘ్రముగ తొలగించివేసినగాని ఆర్థికముగ దేశము స్వయంసమృద్ధము కాజాలదు. శ్రీ చింతా మణి దేశముఖ్ ఈ పనిని సాధింపగలుగుదు రనుటకు ఎట్టి సందేహమూ లేదు.

రిజర్వుబ్యాంకు గవర్నరుగ పనిచేసి వారు ప్రభుత్వఆర్థికసమస్యలను, దేశఆర్థికస్థితిగతులను పూర్తిగ ఆకళింపు చేసుకొనిరి. ప్రపంచద్రవ్యనిధి బ్యాంకులతోను, భారతప్రతినిధిగ రాయబారములు జరిపి, గతసంవత్సరము వాషింగ్టన్ నందు జరిగిన త్రైపాక్షికఆర్థికసంప్రతింపులకు భారతీయ పరిశీలకుడుగ హాజరై, ప్రపంచార్థికవ్యవహారములను భారతదేశవిదేశీ ద్రవ్యావసరములను పూర్తిగ గ్రహింపగలిగిరి. బ్రిటిషుప్రభుత్వఖజానాశాఖ సూచనపై, అమెరికా, బ్రిటన్ స్టెర్లింగు ఋణములో

కొంతభాగమును భరించుట జరిగిన, అట్టి ఏర్పాట్లకు సంబంధించిన రాయబారములు జరుపుటకు శ్రీ చింతామణి దేశముఖ్‌ను మించిన సమర్థుడు లేడనియే చెప్పవచ్చును. భారతదేశము స్వాతంత్ర్యమును పొందిన అనంతరము బ్రిటన్‌తో జరిగియుండిన స్టెర్లింగు ఒప్పందమును వర్తమానావసరములకు తగ్గట్టుగ మార్చుకొనుటకు జరిగిన సంప్రతింపులలో పాల్గొనియుండుటవలన కూడ స్టెర్లింగుఋణపరిష్కారమునుగురించి తిరిగి ప్రారంభము గానున్న సంప్రతింపులలో వీరు పాల్గొని న్యాయము జరుగునట్లు చూడగలరు.

వ్యాపార, పారిశ్రామికరంగములకు సంబంధించిన ఆర్థికసమస్యలను వీరు ఆమూలాగ్రముగ పరిశీలించియుండిరి. అంతేగాక గ్రామీణఆర్థికవిషయములందును వీరికి ప్రావీణ్యము గలదు. వ్యవసాయోత్పత్తి అధిక మగుటకు గ్రామీణఆర్థికవ్యవస్థను ఏవిధముగ పునర్నిర్మింపవలసియుండునో వీ రిదివరలో రిజర్వుబ్యాంకు గవర్నరుగ నున్నపుడు అనేకసూచనలను చేసియుండిరి. వాటినన్నింటిని స్వయముగ అమలు జరిపి వ్యవసాయదారులకు పరపతిసౌకర్యములను కల్పించి ఉత్పత్తిని అధికము చేయుటకు ఎక్కువగ తోడ్పడగలరు.

ప్లానింగ్ కమిషన్ సభ్యుడుగ నున్న వీరు ఆర్థికమంత్రిగ నియమితు డగుటవలన దేశాదాయవ్యయములను గమనించి ఈ కమిషన్ వివిధపథకములను తయారుచేయుటకును పరిశీలించుటకును ఎక్కువ అవకాశములు ఉండగలవు. ఈ పథకములను తయారుచేయుటలో, ముందు వెనుకలను నిర్ణయించుటలో ప్లానింగ్ కమిషన్ కొంత వాస్తవికదృష్టిని ప్రదర్శింప వీలగును.

శ్రీ రాజగోపాలాచారిగారు కేంద్రమంత్రివర్గ ఆర్థికఉపసంఘుఅధ్యక్షుడుగను, శ్రీ చింతామణి దేశముఖ్‌గారు ఆర్థికమంత్రిగను ఉండిన ప్రభుత్వ ఆర్థికవ్యవహారములు కుదుటబడి, ఎంతోకాలముగ ప్రభుత్వము సంకల్పించుచున్న ఋణములు లభించి ధనాభావమువల్ల నిలిచిపోయిన అనేక అభివృద్ధిపథకములు శీఘ్రముగ అమలుజరుగుటకు వీలుకలుగవచ్చును.

కాని రాష్ట్రప్రభుత్వములకు, ముఖ్యముగ చెన్నరాష్ట్రప్రభుత్వము నకు, ఈ నియామకము అంతతృప్తిని ఇవ్వకపోవచ్చును. ఆదాయపుపన్ను పంపకము విషయములో ఇటీవల వీ రిచ్చిన తీర్పు అనేకరాష్ట్రములకు ఆశాభంగమును కల్గించెను. కాని ఆర్థికమంత్రిఅయిన అనంతరము-వారు లోగడ ఇచ్చిన తీర్పు తాత్కాలికమైనదే గనుక- పరిస్థితులను పునరాలోచించి ఈ సమస్యను తృప్తికరముగ పరిష్కరింతు రని ఆశింపవచ్చును.

మధ్యతరగతివారి ఇబ్బందులను పూర్తిగ అవగాహన చేసుకొనినవారైనందున ఇకమీదట పన్నుభారముతగ్గింపు విషయమునగాని, అదనపు సౌకర్యములను కల్గించు విషయమునగాని మధ్యతరగతివారికి ఎక్కువ సౌకర్యములను కల్గింతు రని, ద్రవ్యోల్బణము వలన ఏర్పడిన విషమపరిస్థితులను శీఘ్రముగ తొలగించగల రనీ ఆశింపవచ్చును.

# విషయానుక్రమణిక
## 13 మే 1950

# అమెరికాకు పట్టుకొన్న అజీర్ణవ్యాధి



పదిహేనేళ్ళనుంచి, అంటే డిప్రెషన్ దెబ్బతిని తేరుకొందామని ప్రయత్నం ప్రారంభించినప్పటినుంచీ, అమెరికా ప్రభుత్వము, ధాన్యాది, వ్యవసాయికవస్తువుల ధరలను కృతకంగా పెంచి, ధాన్యాదులలో భూస్వాములకు వ్యాపారులకు అండగా నిలిచి నడుపుకొంటూ వస్తూంది. దీని ఫలితంగా అప్పుడే నాలామాట్లు, గోధుమలు, బంగాళాదుంపలు, కాఫీగింజలు, మొదలైనవి, మిలియన్ల టన్నుల కొద్దీ, అమ్ముడు పోకుండా, తగులబెట్టకోడమో సముద్రంలో పారపోయటమో జరగుతూ వచ్చింది. యుద్ధానంతరం, మార్షల్ ప్లానులు మొదలైనప్లానులన్నీ తయారు చేసుకొని, ఈకృతకవిధానాన్ని ప్రపంచ వ్యాప్తంగా రుద్దటానికే అమెరికన్ ప్రభుత్వం ప్రయత్నిస్తూంది. కాని ఈ కృతకపు ధరల విధానంలోని, విషప్రవృత్తి, పెరిగి, పండి, దాని పాపఫలాలను పరిపూర్తిగా పండించే రోజులు వచ్చేశాయి.

ఇంత ఎక్కువ మిగుళ్ళు ఉన్నాయంటే, అమెరికాలోని ప్రతిపౌరుడూ తిన్నంత తినీ, పారేసినంత పారేయగా, మిగిలిన, అపారసంపదలు ఇవి అని ఎవరన్నా భ్రమపడితే, అంతకన్నా అమాయకత్వం ఉండదు. ఈవస్తువులకు ప్రభుత్వం నిర్ణయించిన ధర, ఇచ్చుకోలేక తిండిలేక మాడవలసిన అమెరికన్ బీదజనమే అపారమైన సంఖ్యలో ఉంది. అక్కడివాళ్ళకే అందవలసిన అవుసరం లేకుండా ఇవి బూడిదపాలూ, సముద్రపుపాలూ అవుతున్నాయంటే, ఎన్నిమార్షలు ప్లానులైనా, ప్రపంచ దరిద్రాన్ని, ఆహారపు కొరతను తీర్చటానికి ఆస్కారమెంతుంటుందో, వేరే చెప్పనక్కరలేదు. అమెరికన్ ప్రభుత్వం అమెరికాలోని వ్యవసాయిక వ్యాపారులకు, భూకామందులకూ ఈ మేలు కూర్చిపెడుతూ వచ్చిన ఈ పదిహేడు సంవత్సరాలలో, ఈ వర్గాలవారు, ప్రజాస్వామ్యం పేరిట ప్రభుత్వంలో బలాన్ని ప్రాపకాన్ని సంపాదించుకొని, తమకు కావలసిన ఆట ఆడుతూ, ప్రభుత్వానికి తాబేదార్లుగానూ, గులాములుగా కూడానూ తయారయి, "ప్రజాహితం" అన్న విషయాన్ని అమెరికా ప్రజలపట్లనే విస్మరించారు. సెనేటు సిండికేటులు గుత్తగొన్న ఈ వ్యాపారులే, స్వదేశంలో తమకు కావలసిన ధర పలకని ధాన్యపు రాసులను, ఇన్నాళ్ళు తగులపెట్టుకొంటూ రావలసిన వస్తుసంపదను, ఆర్థికసహాయం పేరిట, డివాల్యూయేషన్ ద్వారా ఎక్కువ ధర రాబట్టగల దేశాలకు, ఎగుమతి చెయ్యాలని ప్రయత్నం చేస్తున్నారు. ఇందువల్ల అమెరికా బీద ప్రజల సంపద పెరగటంగానీ, దెబ్బతిన్న దేశాలలో బీదల అవసరాలు తీరటంగానీ జరుగవు. అటు ఇటూ ఉభయదేశాలలోనూ ప్రభుత్వాలు ఇచ్చే అండవల్లా, ప్రోద్బలంవల్లా, లక్షలు సంపాదించుకోగల ధనికస్వాములు కొద్దిమంది మాత్రం మిగులుతారు. ఈ అప్పులూ, పెట్టుబడులూ, దేశాలలో జీవనవ్యయపరిమాణాల్నీ, దేశీయఋణాల్నీ కృతకంగా పెంచి, ఉభయదేశాలూ ఆర్థికంగా చితికిపోటానికో, లేక ఈ కొద్దిమంది ధనికస్వాముల చెప్పుచేతులలో పడిపోటానికో దారితీస్తాయి తప్ప, దేశసౌభాగ్యాలు పెంపొందించగలిగిన అవకాశము, ఈ కృతక ఆర్థికనీతివల్ల సమకూరదు.

ఇతరదేశాలకు సహాయాలమాట అటుంచి అమెరికాదేశంలో జరుగుతున్న విషయాలే తీసుకొందాం. ప్రభుత్వం ధరలకు అండగా నిలవటంవల్ల, వస్తువులకు, డిమాండు, అండ్ సప్లయి, (వస్తువుల అవసరమూ, అందుబాటు) అన్న ఆర్థికనీతినిబట్టి వస్తువులకు కలిగే ఋజువైన ధరలు కాక, కృతకంగా పెరిగిపోయిన ధరలలో వస్తువులు చెలామణి అవుతున్నాయి. ఒక్కసారి ప్రభుత్వం, వీరికి అండగా నిలవటం మాని తన పెత్తనం ఉపసంహరించుకొంటే, ఈవ్యాపారులు కట్టున్న ధరల మేడ దుప్పగా కూలిపోవలసివస్తుంది. అమెరికాకు అవసరమైన ధాన్యాదులకంటె ఇబ్బడిముబ్బడిగా పండించి ఈ భూస్వాములు, ధనస్వాములు, ఎక్కువధరలు నిర్ణీతంగా ప్రభుత్వమే చేకూర్చిపెట్టగలదన్న ధీమాతో వాట్లను వ్యాపారంలోకి పెట్టగలుగుతున్నారు. అమెరికన్ ప్రభుత్వధనంలో గతసంవత్సరం పొందిన 180,000,000 (18కోట్ల) డాలర్ల నష్టంలో, ఎక్కువభాగం వీరికి, ఈ ధనస్వాములకు భూస్వాములకు ఇవ్వవలసిన సహాయంకిందే నష్టమయింది. ఈసంవత్సరం అమెరికన్ దేశవ్యయంలో మొత్తపు నష్టంలో, నాల్గవభాగంకూడా దీనిక్రిందే నష్టమవుతుంది. పేరాశవల్ల మునుపు వ్యాపారులు పొందవలసిన నష్టాలు, ఈనాడు వారికి బదులు, వారి పేరాశకు ఫలితం చూపించి, ప్రజాస్వామ్యంపేరిట జరుగుతున్న అమెరికన్ ప్రభుత్వం నష్టపడవలసివస్తోంది.

(ఇల్లాగే మన దేశంలోనూ, ధాన్యమూ, పంచదార వస్త్రాలూ మొదలైన వస్తువులన్నిటిలోనూ, స్వదేశవిదేశవ్యాపారుల పేరాశలకు లాభాలు ప్రభుత్వమే కూర్చిపెట్టటానికి హామీ పూనుకొని ధరలు నిర్ణయించాల్సి వచ్చేటప్పటికి, దేశీయఖజానాలు, ప్రజలధనమూ అధికంగా నష్టపోయి, బీదప్రజలకు కన్నులకు తగసౌకర్యాలు అటుంచి, కంట్రోళ్ళమీదే తిండీ, బట్ట, మొదలైన అవసరవస్తువులు సమకూరే పరిస్థితులను కల్పించలేకపోతోంది. దేశంలో బీదవాని అందుబాటును బట్టి ధరలను నిర్ణయించితే ప్రజలకు సౌఖ్యప్రదంగా, ఉత్తమోత్తమవిధానంగా వ్యవహారంలో నడవవలసిన కంట్రోళ్ళు, ధనస్వాముల, లాభాపేక్షను మూలంగా తీసికొని, ధరలు నిర్ణయిస్తూ రావడంవల్ల ప్రజలకు క్షేమంకరంగా ప్రజాపీడాకరమైన వ్యవస్థగా మారిపోతున్నాయి)

అమెరికన్ ప్రభుత్వం, వ్యాపారులదగ్గర నుంచి కొన్న బంగాళాదుంపల సరుకు అధికమయ్యేటప్పటికి. వాట్లను కుళ్ళబెట్టించి చివరకు, పాడయాక, గోనుసంచుల ఖరీదుకన్న తక్కువలకు అమ్మి, 204 లక్షల డాలర్లు నష్టపోయింది. కాలిఫోర్నియాలో ఎండుద్రాక్షపళ్ళను తను చెప్పుకొన్న ధరపలుకనందున, పందులకు మేపి ప్రపంచ బీదప్రజలపై కసితీర్చుకొంది. కాఫీగింజలు మొదలైనవి ఓడలకొద్దీ సరుకు తగులబెట్టిన రోజులూ ఉన్నాయి. ఈ వార్తలలో ఒక్కొక్కప్పుడు కొంత అతిశయోక్తి ఏకొద్దో ఉండవచ్చునేమోగాని, అసలు జరుగుతున్న విషయం అబద్ధం కాదు.

ఒక ప్రత్యేకవర్గానికి, (ఉదా: మన దేశంలో పంచదార బట్టల మిల్లుదార్లు మొదలైనవారు) ప్రభుత్వం అండగా నిలిచి దేశసంపదవృద్ధి చేయటం వాళ్ళకు సహాయం చేయటానికి పూనుకొంటే, ఆ సంపద వృద్ధి చేయటంలో, వాళ్లు దేశాని కిచ్చేది అరదమ్మిడీకూడా లేకపోగా, ప్రజాస్వామ్య ప్రభుత్వపు ఖజానాకు నష్టం ఎల్లా వస్తుందో గ్రహించటానికి ఈపై విషయం ఉదాహరణగా చాలుతుంది. బొగ్గు పరిశ్రమకు కూడా, అమెరికన్ ప్రభుత్వసహాయం సమకూర్చేందుకు, ఆ పరిశ్రమనాయకుడు ఒకేవిధానం అవలంబించాడు. అయితే, ఇక్కడ గుడ్డిలో మెల్ల ఏమిటంటే, అధికంగా మిగిలిపోయిన బొగ్గును ప్రభుత్వమే కొని, మళ్ళీ రైలు, ఓడపరిశ్రమదారులకు బోల్లాస్టుగా వాడేందుకు ఉచితంగా యిచ్చేయటం గాని, లేదా పెద్దచలిమంటలు వెయ్యాలనిగాని షరతు పెట్టలేదు.

అమెరికన్ ప్రభుత్వానికి "కమ్మాడిటీ క్రెడిట్ కార్పొరేషన్"—అంటే ధాన్యాది వస్తువుల తనఖా బ్యాంకులాంటిది—ఉంది. ఈరోజు అమెరికా ప్రభుత్వం 300 కోట్ల డాలర్ల అప్పులు, అప్పుకోసం ధాన్యాది సేకరణ, ధాన్యాదుల కొన్నవి, కొంటామని అగ్రిమెంటులో ఉన్నవి—వీటిపై పెట్టుబడి గాని ఖర్చుగాని పెట్టింది. గత సంవత్సరం, దేశంలోని గోధుమపంటలో నూటికి 21 వంతులు, పత్తిపంటలో నూటికి 26 వంతులు స్వయంగా సేకరించుకొంది. ఈ నిలవలో కొద్దికొద్ది భాగాలుమాత్రం, యుద్ధంలో దెబ్బతిన్న యూరప్ దేశాలకు అల్లాంటి "సహాయం" క్రింద ఉన్న దేశాలకూ, పంపింది. మరికొంత, స్వదేశంలోని ఉచిత సంస్థలకు ధర్మంగానూ, బీదబాలురకు కొత్త మధ్యాహ్నపు ఫలహారాలు సమకూర్చటానికి ఆహారదానపు ప్రణాళికగానూ, స్వల్పంగా వినియోగం చేయగల్గింది. ఇన్ని చేసినా, రెండువందల కోట్ల డాలర్ల విలువగల సరకు, గిడ్డంగిలోనుంచి వదల్చుకోలేక బరువుతో కుంగిపోతోంది.

ఇప్పటికింకా ఉన్న ఈ సరుకు నిల్వల మొత్తాలు చూద్దాం.

● దాదాపు 50 లక్షల పత్తిబేళ్లు విలువ 75 కోట్ల డాలర్లు. ఈ సరుకు అమెరికా బట్టల మిల్లులన్నిటికీ, ఏడు నెలలవరకూ ఎడతెగకుండా సరిపోతుంది.

● దాదాపు 40 కోట్ల బుషెల్ల గోధుమలు. విలువ 90 కోట్ల డాలర్లు - అమెరికాలో ప్రతి ఒక్క పౌరునికీ వారానికి ఒక గోధుమరొట్టె చొప్పున, ఏడాదిపాటు వరుసగా ఇస్తూవచ్చినా, ఇంకా ఎద్దడిగా మిగులుతుంది ఈ సరుకు.

● దాదాపు 600 కోట్ల బుషెల్ల, వరి ధాన్యము. విలువ, 90 కోట్ల డాలర్లు. (ఈ ధాన్యం అమెరికాలో గొడ్లకు పెడతారు. ఈ నిల్వ గత సంవత్సరం పొడుగునా, దేశమంతటా గొడ్లకు పెట్టిన ధాన్యపు మొత్తంలో నాలవవంతు.)

● ఏడుకోట్ల పౌనుల ఎండు కోడిగుడ్లు. విలువ పదికోట్లడాలర్లు. అమెరికన్ రొట్టెల వ్యాపారస్థులందరికీ ఐదు ఏళ్ళపాటు సమృద్ధిగా చాలిన సరుకు.

● పదికోట్లపౌనుల బరువుకు మించిన వెన్న. విలువ 6 కోట్లడాలర్లకు పైపెచ్చు-బహుశా రష్యా ఏడాది పొడుగునా తయారుచేసే వెన్నమొత్తంకన్నాకూడా ఎక్కువ.

● 25 కోట్ల పౌనుల బరువు మించిన, ఏండగట్టిన పాలపొడి. ధర మూడుకోట్ల డాలర్లు. అమెరికాదేశమొత్తానికీ, తొమ్మిది నెలలకు సరిపడ్డ సరుకు.

ఇంతతో ఈనిల్వల పట్టిక ముగియలేదు. బేళ్ళకొద్ది పొగాకు, ఎండుపళ్ళు, టర్పెన్‌టైన్, ఉన్ని, చిక్కుడుగింజలు, బటాణీగింజలు, ఇల్లా ప్రతివస్తువు, ఆకాశానికంటే కుప్పలు, మేట్లుగా తయారయి నిల్వలున్నాయి. ఇవి పట్టేందుకు స్థలం లేదు. ప్రపంచబీదప్రజలకు, అనేకకోట్లమందికి, తిండీ బట్టా ఇచ్చేందుకు ఈనిల్వలు చాలుతాయి అయితే, ప్రభుత్వపు క్రెడిట్ కార్పొరేషనువారి రూల్సు ప్రకారం, ఈవస్తువులు అల్లా వినిమయం చేయటానికి సతరామూ వీలుపడదు. ఈకార్పొరేషను నిర్ణయించిన ధరలకు, ప్రపంచబీద ప్రజల మాట అటుంచి, జీవనప్రమాణం అధికంగా ఉన్న అమెరికన్ సామాన్య ప్రజలే ఈవస్తువుల్లో ఒక్కటీ కొనుక్కోలేరు. ఈనిల్వలు తగ్గే అవకాశం లేదు. పైపెచ్చు, ప్రస్తుతం అమెరికన్‌ప్రభుత్వం వ్యావసాయికదారులపట్ల అవలంబిస్తున్న విధానాలవల్ల, ఇవి ఇంకా పెరిగేవే కాని తరిగేవి కావు.

ధాన్యాదుల ధరలు, * సరుకునిల్వనుబట్టీ, ప్రజల అవసరాన్నిబట్టీ, వాటంతట అవే నిర్ణంలోకి రావటం, ఆరోగ్యకరమైన వ్యాపారలక్షణం. అల్లా కాకుండా, ప్రభుత్వం, తనరూల్సు అనే ఊతాలు పెట్టి, ధరల కట్టడాన్ని కృత్రిమంగా నిలబెట్టే ఏఅస్తవ్యస్తాలూ, అభూత పరిస్థితులు వస్తాయో ఊహించటంకూడా కష్టమైపోవచ్చును. ఈవిధానానికి మచ్చుగా, కెనడా బంగాళాదుంపల వ్యాపారకథను పరిశీలిద్దాం.

1950 ఏప్రిల్ అంతానికి, అమెరికా స్వదేశంలో పండిన, 5 కోట్ల బుషిల్ల, బంగాళాదుంపలను, నాశనంచేసుకోటమో, ఉచితంగా పారబోసుకోవటమో జరిగింది. ఆసంవత్సరంలోనే, 2కోట్ల బుషిల్ల బంగాళాదుంపలు కెనడానుంచి దిగుమతిచేసుకో వలసివచ్చింది. ఇది ఎల్లా జరిగింది? అనేకమంది చేసినట్లే జోసెఫ్ సీ గారీ అనే ఒక న్యూఆర్లియను వ్యాపారస్థుడు చేసినపని ఒకటే చూద్దాం. కెనడానుంచి వదీ

మార్గాలమీద అమెరికాకు పదిలక్షల పౌనుల బంగాళా దుంపలు దిగుమతి చేశాడు. ప్రభుత్వం పన్నులన్నీ ఇచ్చుకొని, ప్రభుత్వ ధరలకంట్రోళ్లు ఆధారంగా తీసికొని నూరు పౌనుల దుంపలు నాలుగుడాలర్లచొప్పున అమెరికాలో అమ్మి అధికంగా లాభం గడించుకోగలిగాడు. స్వరాష్ట్రమైన న్యూఆర్లియన్సు రైతులవద్దకొని బంగాళాదుంపలు రైలుమీద తెచ్చి వ్యాపారం చేస్తే, వ్యాపారస్థుడికే నూరు పౌనలధర, 4 4 డాలర్లవుతుంది. కనడానుంచి నదిమీద తెచ్చి వ్యాపారం చేస్తే, రైలుఖర్చులూ తగ్గుతాయి; ప్రభుత్వ సుంకాలు అన్నీ చెల్లించుకొన్నా - వ్యాపారస్థుడికి, నాలుగుడాలర్లలో లాభం ఎక్కువ మిగులుతుంది. ఈవ్యాపారం ఇల్లా సాగిస్తే, ప్రభుత్వపు రూల్సుకు వేటికి భంగమూ ఎక్కడా ఏమీ లేదు. కాని అక్రమంగా బంగాళాదుంపలు బ్లాకు మార్కెటు చేసినట్లు చెయ్యటానికి, కనడా, అమెరికన్ వ్యాపారస్థులకు ఉభయులకూ మంచి అవకాశం దొరికింది. కనడాలో బంగాళా దుంపలు నూరుపౌనులూ 80 సెంట్లధరకు (0.8 డాలరు) దొరకుతాయి. సరిహద్దుదాటి ఇటు అమెరికాలోకి, వస్తే వ్యవసాయదారునికి ఇవ్వవలసింది, ప్రభుత్వం నిర్ణయించిన ధర నూరుపౌనులకూ 1. 90 డాలర్లు (కనడాధరకు దాదాపు రెండున్నరరెట్లు ఎక్కువ)- సరిహద్దున పోలీసుకాపలా లేని చోట ఇటూ అటూ జేరవేసే ఈవ్యాపారంలో బంగాళాదుంపల వర్తకం, బంగారు, వజ్రాల వర్తకాన్ని మించిపోయింది.

(వరిధాన్యం ఎక్కువ తినని, ఉత్తరప్రదేశంలో పండించిన వరిధాన్యానికి, వరిపంట తినే దేశమై తక్కువపంట పండిన మద్రాసు రాష్ట్రం, ధాన్యం దిగుమతిచేసుకోవలసివచ్చేటప్పటికి, ఒకే కేంద్రప్రభుత్వంకింద ఉన్న, వివిధరాష్ట్రప్రభుత్వాలు ధాన్యపుదారుః కియ్యవలసిన ధరల నిర్ణయంలో, సమన్వయం లేకుండా వ్యవహరించటంవల్ల, మద్రాసు ప్రజలధనాన్ని నూటఇరవై లక్షలరూపాయల పైచిల్లు, మద్రాసుప్రభుత్వం అదనంగా నష్టపడవలసి వచ్చింది.)

ఈసంపద అంతా ఇల్లా పెరిగి కుళ్ళిపోతూంటే, నీటిని పెట్టుకోటానికి జాగా చాలక అమెరికన్ ప్రభుత్వం ఇబ్బందులు పడవలసివస్తోంది. [illegible], ఈ ఏడు 80 మిలియన్ల డాలర్లు, ఖర్చుపెట్టి, కొట్లు కట్టుకోటమో, అద్దెకు పుచ్చుకోవటమో చేయవలసివస్తోంది. దొరికిన ఖాళీజాగాలో, విమాన కేంద్రంగానీ, పాఠశాలగానీ ఎక్కడ పడితే అక్కడ సరుకు నింపుతున్నారు.

ఈ సరకువిషయం అమెరికన్ ప్రభుత్వం ఏం చెయ్యాలో తెలియక చిక్కు సమస్యలో ఇరుక్కుపోయింది. విదేశాలలో ఈసరకు నీనష్టానికో చవుకగా అమ్మవామని కొందరంటారు. విదేశాలనుంచి ఇతర సరకులు మారకం తీసికొని ఇచ్చివేద్దామని కొందరంటారు. కాని అటూ ఇటూ పెద్దబేరాలు, తగిలే అవకాశమే లేదు. పోతే ఒక్క భారతదేశంనెత్తిని పదిలక్షల టన్నులు గోధుమలు రుద్ది, అడ్వాన్సుగా ఇచ్చినట్లు లెఖ్ఖ వేసి, ముందు ముందు అవసరమైన మైకా, మాంగనీస్ మొదలైన ముడివస్తువులు తీసుకొందామని బేరం సాగిస్తున్నారు. ఒకవేళ ఈబేరం కుదిరి, హిమవత్పర్వతమంతటి సరుకువిడుదలైనా, ఈనిల్వ మొత్తంలో పదోవంతు గోధుమలుమాత్రమే ఖాళీ అవుతాయి.

వ్యవసాయశాఖవారు, ఉత్పత్తి తగ్గించమని వివాదం లేవతీస్తున్నారు. పొగాకు, వరి, గోధుమ, పత్తి పంటలు తగ్గించమని వ్యవసాయదార్లకు ఆదేశాలు ఇస్తున్నారు. కానీ ఒక పంటకు ఎకరాలు తగ్గిస్తే అక్కడే మరోపంట తీస్తుంది. నిలవ ఒకసరుకునుంచి మరోసరుకుకు మారుతుంది.

నిజానికి దేశానికి అవసరమైన పంటలు లేకపోలేదు. పశుగ్రాసాలు, గడ్డి మొదలైనవి ఎక్కువ అవసరమే ఉన్నాయి. ఉన్న పంటలు కూడా, ప్రభుత్వం పక్షపాతాలు చూపటంవల్ల ధరలుపెంచేమార్కెటులేకుంటే ప్రజలందరికీ వినియోగంగా దొరికి, కుళ్ళిపోడవలసిన నిల్వల ప్రమేయం ఉండదు. కాని దేశరాజకీయాలు, ఈపద్ధతులకు అస్కారమే ఇయ్యవు. ప్రజాసామ్యంలో ఓట్లకోసం, ప్రజాక్షేమానికి భంగంగా, ఒకొక్క బలీయవర్గానికి అనుకూలంగా, ప్రభుత్వం నియమాలూ నిబంధనలూ చేసికోటం మాననంతవరకూ, వ్యాపారరాజకీయాలు ప్రభుత్వయంత్రాంగంపై ప్రభావం పరపించుకోటం మాననంతవరకూ, ప్రజలకు తిండిబట్టల వినియమనంలో, అవకతవకలు పెచ్చుపెరిగిపోటం తప్పదు. తాత్కాలికంగా బలం సంపాదించుకోటానికి ఒక వర్గాన్ని ఆశ్రయించి, వాళ్ళ పేరాసకు, తక్కిన ప్రజాక్షేమాన్ని బలిచేసే రాజకీయాలు, ప్రజాస్వామ్యవిధానంలో అంతరించేవరకూ ఈ ముప్పు ఆ ఒక్క ప్రజాస్వామ్యదేశానికే గాక తద్వారా తక్కిన ప్రపంచానికి కూడా తప్పదు.

[అమెరికన్ "ఫార్చ్యూన్" పత్రిక వ్యాసం ఆధారంగా.]



వరంగల్‌లో శ్రీమతి వెల్లోడిసతీ, ప్రసూతిశాలకు ప్రారంభోత్సవం జరిపినప్పటి చిత్రం.

# మనదేశం

## సి. డి. దేశముఖ్ *

భారత ఆర్థిక శాస్త్ర ప్రవీణులు, వ్యవహారదక్షులు, అయిన శ్రీ చింతామణి ద్వారకనాథ్ దేశముఖ్ గారు కేంద్రమంత్రివర్గంలో ఆర్థిక శాఖామంత్రిగా నియమితులైనారని ప్రకటించబడగానే దేశంలోని సర్వవర్గాలవారూ హర్షించారు. మన ఆర్థిక శాస్త్ర ప్రవీణుల్లో యువకులని చెప్పదగిన దేశముఖ్ గారి వయస్సు 54 సంవత్సరాలు. రిజర్వుబాంక్ గవర్నరుగా నియమితులైన ప్రథమభారతీయులు. బాంకు నిర్వహణలో సంస్కరణలు ప్రవేశపెట్టి, పరిశోధన శాఖను ఏర్పాటు చేశారు. ఆపైన విదేశాలతో భారతదేశ ఆర్థిక వ్యవహారాల నిమిత్తం ప్రత్యేకరాయబారిగా నియమితులైనారు. భారత ప్రభుత్వపు ప్లానింగ్ కమిషన్‌లో సభ్యులుగా కూడా నియమించబడినారు.

దేశముఖ్ గారు ఆర్థికమంత్రిగా నియమించబడినట్లు ప్రకటన వెలువడగానే బొంబాయిమార్కెట్‌లో టాటావారి డెఫర్డ్ షేర్ల విలువ 30 పాయింట్లు పెరిగిందట. మనదేశంలో వ్యాపారగతి తెలుసుకోడానికి ఈషేర్ల విలువే ఆధారం. ఏరాజకీయాలతో గాని, ఆర్థికవిధానాల తగవులతో గాని జోక్యం లేని దేశ్ ముఖ్ గారు, ఏ పెద్ద ప్రణాళికల్ని తలపెట్టినా తలపెట్టకపోయినా, కనీసం ఆర్థిక రోగాలకు చికిత్స చేసి పుష్టి కలిగించగలరనే ఆశాభావం అందరికీ ఉంది. ఏ కార్యక్రమం తలపెట్టినా పెడదోవలు పట్టుతున్న ప్రస్తుత స్థితిలో నివారణోపాయం తెలియక గిజగిజలాడుతున్న పాలకవర్గానికి మార్గనిర్దేశం చెయ్యగల సమర్థులు వీరు. కంట్రోల్స్ నిర్వహణ గురించీ గ్రామ్య ఆర్థిక వ్యవస్థ గురించీ రిజర్వుబాంక్ గవర్నరుగా ఉన్నప్పుడు కొన్ని సంస్కరణలు సూచించారు. కంట్రోల్స్, విదేశాలతో వ్యాపారం, దేశీయార్థిక సంస్కరణనుగురించి వీరికి కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి. ఏదిక్కూ తోచక అల్లాడుతున్న దేశీయార్థిక యష్టికి ఒక విశిష్టస్వరూపాన్ని వీరు ప్రసాదించగలరని ఆశించవచ్చును.

ఇంతవరకూ ఆర్థికమంత్రిగా పనిచేసినవారిపట్లను పార్లమెంటుసభ్యులకుగాని, దేశవ్యాపారులకుగాని విశ్వాసం లేకపోయింది. కాని దేశ్‌ముఖ్ గారి వ్యవహారదక్షతగురించీ ఆర్థికనీతిగురించీ అన్నివర్గాలవారికీ అపారమైన విశ్వాసం ఉంది. అందువల్ల ఇకముందు ఆర్థిక మంత్రిగారు కంట్రోల్స్, పరపతినిర్ణయం, ప్రభుత్వ వ్యయం తగ్గింపు మొదలైనవి ఏ కార్యక్రమాలను తలపెట్టినా దేశం సహకరించగల అవకాశం కలుగుతోంది.

## నిర్బంధశాసనాలు *

కొత్తరాజ్యాంగం అమలుజరిగిన తరవాత వెంటనే ఎంతవరకూ ప్రజాస్వామ్యసూత్రాలు ఆదరించబడుతున్నాయో పరీక్ష జరగడం సహజమే; అవసరంకూడా. ఈపరీక్ష సుప్రీంకోర్టులో ఈమాసంలోనే ప్రారంభమయిందని చెప్పవచ్చును. గీటురాయిమీద చూస్తే చాలా వన్నెలు కానవస్తున్నాయి.

ఇటీవల భారతప్రభుత్వం చేసిన నిర్బంధశాసనం (ప్రివెంటివ్ డిటెన్షన్ ఆక్ట్) నూతన రాజ్యాంగనియమాలకు విరుద్ధమైనదనీ, ఆ శాసనంకింద నిర్బంధించడం అక్రమమనీ వాదిస్తూ తనను విడుదలచేయించవలసిందిగా మలబార్ కమ్యూనిస్టు ఏ. కె. గోపాలన్ సుప్రీంకోర్టులో పిటిషన్ పెట్టాడు. సుప్రీంకోర్టుకు గల అధికారం, శాసనసభలకు గల అధికారం వాని హద్దులు, వ్యక్తులకు ఇవ్వబడిన హక్కులు వాని హద్దులు, మొదలైన విషయములు ఈ కేసులో చర్చకు వచ్చాయి. ప్రజాస్వామ్యంలో వివిధ స్వాతంత్ర్య ప్రమాణాలు వ్యక్తిపరమైనవి సమష్టిఅవసరాలనుబట్టి, సమష్టిపరమైనవి వ్యక్తిగతావసరాలనుబట్టీ పరిమితం కావాలనే అభిప్రాయం అనుభవరీత్యా ఈ శతాబ్దంలో గుర్తించబడినదే. ఈహక్కులు అధికారాలూ నిర్నిబంధం కారాదని అన్యదేశాల అనుభవం నిరూపిస్తున్నది. ఈఅనుభవగతవిషయాలను పూర్తిగా పత్రబద్ధం చెయ్యడంవల్లనే మన రాజ్యాంగం ఇంతగా విస్తరించిపోయింది. అయితే గ్రంథవిస్తరణవల్ల సందిగ్ధతకూ

(35 పేజీ చూడుడు)



కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ చింతామణి దేశ్‌ముఖ్

నవల:




శ్రీ నోరి నరసింహశాస్త్రి

3వ

భరతఖండముమీదికి పలుమారులు విదేశీయులు దండయాత్రలు సలిపిరి. ఆ వచ్చినవారు విదేశీయులే గాక విజాతీయులును విరుద్ధ ధర్ములును! అట్టగుటచే భరతభూమిలోని జన మందరును వారి కొక్కటియే. తురీయాశ్రమి యేమి, వనప్రస్థు లేమి, యోగు లేమి, విద్వాంసు లేమి, తస్కరు లేమి, ధనవంతు లేమి, పేదవా రేమి, పెద్ద లేమి, పిన్న లేమి—అందరు నొక్కటియే! భరతభూమిలోని జనమును తమ కత్తుల కెర చేయుట వారి కొక యాట. పిల్లలు గండుచీమలను పట్టుకొని నలిపి వేయుదురు; తూనీగల రెండు రెక్కలు పట్టుకొని తోకకు దారములు కట్టి ఎగుర వేయుదురు; పక్షులు చెట్లపై గూళ్లలో పెట్టిన గ్రుడ్లను, వదలిపోయిన చిన్న పిల్లలను అపహరించి, పెద్దపక్షులు వచ్చి యది చూచుకొని ఆ చెట్టుచుట్టును అల్లాడుచు ఎగురుచుండగా చూచి ఆనందముతో గంతులు వేయుచు, ఆ యల్లాడు పక్షులపై రాళ్లు రువ్వుచుందురు. సరిగా నట్లే, విదేశములనుండి వచ్చిన శత్రువులకు ఈ దేశప్రజలను బాధించుటకూడ నొక క్రీడయే!

కాని భరతఖండములో నొక రాజు మరియొక రాజుపై దండెత్తిపోయినప్పుడు అట్లు కాదు. ఈ దండయాత్రలు రాజులకును రాజులకును సంబంధించినవియే; యుద్ధము చేయుట ఎదుర్కొనిన సేనలతోడనే! ప్రజలతో విరోధము లేదు. మహాయుద్ధము జరుగుచున్న చోటికి సమీపప్రదేశములనే కృషీవలులు శాంతముగా తమ పొలములు దున్నుకొనుచునో, అందు విత్తులు చల్లుకొనుచునో, అందుండి నూర్చిన పంట తెచ్చుకొనుచునో శాంతముగా నుందురు; వివాహములు జరుగుచుండును; యజ్వలు నిరాటంకముగా తమ చేయు యజ్ఞములు కొనసాగించుకొనుచుందురు.

అంతే కాదు: యాత్రచేయు మహాసేనలతోకూడ పండితులు కవులు గాయకులు నటులు విదూషకులు బహువిధవినోదకులు కలసి నడచుచుందురు. వారికిని ఆ సేన నడచుచున్న యాయాప్రదేశముల నున్న విద్వాంసులతోడను వినోదకులతోడను చర్చలు, గోష్ఠులు, వివాదములు ప్రవర్తమానము లగును. వారును ఎవరికున్న అధికారము కొలది వారా సేనాజనము నాకర్షించి బహుమానము లందుచుందురు. ఈ విధముగా సేనాచలనమూలమున నొక ప్రాంతమందలి కవి నటగాయకాదు లితరప్రాంతములలోని రీతులు అనుకరించుట అభ్యసించుట సాధ్యపడుచుండెను. ఈ విధముగా వివిధప్రాంతీయ సంస్కృతులకు ఏకభావము సమకూరుచుండెను. మధ్య మధ్య వారిలో వారికి స్పర్ధలు పెరుగును. సభలు జరుగును. విద్యాప్రదర్శన మొనర్చి మెప్పించి గెలిచినవారు జయపత్రము లందుటయు కద్దు.

అందును కొప్పెరుంజింగని యాంధ్రదేశదండయాత్ర విశిష్టమైనది. అతనిలో చిత్రముగా రెండువిరుద్ధప్రకృతులు మిశ్రితమై యున్నవి. అతని సైనికులు బహుక్రూరులు. అతడు వారు చేయు ఘాతుకకృత్యములు వారింపడు. అయితే అతడుమాత్రము బహుసౌమ్యుడు; సరసుడు; దయాస్వభావము కలవాడు; లలితకళలందు విశేషాదరము కలవాడు. ఇంతియ కాదు. అతడు స్వయముగా కర్మిష్ఠి. అందుచే నాతడు సాగ్నికుడై దండయాత్రలకు వెళ్లుచుండువాడు. ఆ యగ్నితర్పణమునకును, మధ్య మధ్య వచ్చు నైమిత్తికములకును, శాంతిపౌష్టికాదికములకును, పురోహితుడును పలువురు ఋత్విక్కులును ఆ సేనవెంట నేగువారు. మరియు నాతడు స్వయముగా విద్వాంసుడు. అతడు 'ఖడ్గమల్లుడే' కాక 'భరతమల్లుడు' కూడను! 'నిశ్శంకమల్లుడే' కాక 'సాహిత్యరత్నాకరుడు' కూడను. అతనికి విశేషముగా నాటకములం దభిమానము. 'నాటకాంతం సాహిత్యం' మందురు గదా! అతనివెంట వెళ్లప్పుడును 'యక్షగాన' విశారదు లగు కర్ణాటకులయు, 'తెరుకూత్తు' నేర్చిన తమిళులయు, సంస్కృతనాటకప్రయోగకుశలు లగు కేరళులయు నటబృందములు వచ్చుచుండెడివి. పర్వసమయములందును వేడుక కలిగినప్పుడును అతడు వారి నాటకములు ప్రదర్శింపజేసి తన సామంతమంత్రిదండనాయకులతో కలసి చూచుచుండువాడు. వానిని చూచుటకు ఆ యా ప్రదేశములం దున్న విద్వాంసులను రసికులనుగూడ నాహ్వానించుచుండువాడు. మధురమైన పదార్థము ఒంటరిగా భుజింపగూడదుగదా!

ఆంధ్రదేశప్రజలకు కన్నడభాషలో నున్న 'యక్షగాన'ములును తమిళములో నున్న 'తెరుకూత్తు'లును బాగుగా నర్థము కావు గనుక అవి వారి కంత నచ్చవు. అందుచే ఆ ప్రదర్శనములకు ఇతరుల నెక్కువ యాహ్వానించువాడు కాదు. కాని కేరళబ్రాహ్మణులు ప్రదర్శించు సంస్కృతనాటకములు తిలకించుటకుమాత్రము విరివిగా ఆంధ్రదేశమందలి కవులను పండితులను అతడాహ్వానించుచుండెను. తెలుగుదేశములో ప్రవేశించినప్పటినుండియు ఈ సంస్కృతనాటకప్రదర్శనములే ఎక్కువ చేయింపసాగెను.

అందుచే నిప్పుడు తిరువనంతపురమునుండి వచ్చి తన్నాశ్రయించి వచ్చుచున్న మళయాళబ్రాహ్మణనటబృందమునకు పని

ఎక్కువ పడినది. వారు ప్రదర్శించు సంస్కృతనాటకముల కర్త వరో ఎవరికిని తెలియదు. కర్త మొదటొకడో పలువురో కూడ తెలియదు. ఆ నాటకములలో కొన్ని పెద్దవి, కొన్ని మిక్కిలి చిన్నవి. సమయానుకూలముగా ఉన్నవ్యవధిని బట్టి యందులో నేదే నొకటి ప్రదర్శింప ననువుగా నుండెను. వాని భరతవాక్యము లన్నింట రాజసింహు డను బిరుదనామము గల రాజువృద్ధిని ఆశించు చుండును.

"హన్త సర్వే ప్రపన్నాః స్మః ప్రవృద్ధకులసంగ్రహాః,
ఇమా మపి మహీం కృత్స్నాం రాజసింహః ప్రశాస్తు నః!"

ఇత్యాదివిధముగా నవి యుండును. కొప్పెరుంజింగడు కూడ రాజసింహబిరుదాంకితుడే కదా! తన ప్రతాపనామమున కర్థము పెద్దరాజసింహుడు డనియే కదా! ఈ కారణముచే నా నాటకములయం దతనికి విశేషపక్షపాతము కలదు. అదియుగాక ఆ నాటకములును మనోజ్ఞమైనవి. అందలి కవిత్వము ఆర్ష వాక్కుకు దగ్గరగా నుండును. రంగస్థలమున ప్రదర్శించుట కవి యెంతయు తగియుండి సామాజికుల కానందము కలిగించును. అందులో 'అభిషేకము', 'ప్రతిమ' ఇత్యాదులు రామాయణకథా నాటకములు. 'పంచరాత్రము' 'మధ్యమవ్యాయోగము,' 'కర్ణభారము,' 'దూతవాక్యము', 'దూత ఘటోత్కచము' 'ఊరుభంగము'!—ఇత్యాదులు భారతకథా నాటకములు. ఈ నాటకములు దక్షిణదేశమునం దల్లెడ వ్యాప్తిలో నుండి పండితపామరులకు ఆదరపాత్రములుగా నుండెను. అందుచే నీ నాటక ప్రదర్శనము లాతడు సగర్వముగా తిలకించువాడు; ప్రదర్శనాంతమున వానిని గూర్చి యాహూతులైన పండితులను ప్రశ్నించుచుండువాడు. వారు నాటకమును తత్ప్రదర్శనమును పొగడినచో నాతడు పొంగుచుండెను.

అయితే ఆంధ్రదేశము ప్రవేశించినదాదిగా నాతని యనుభవము విచిత్రముగా నుండెను. అది యాతని కాశ్చర్యము కలిగించినది. ఆ సంస్కృతనాటకచక్ర మిక్కడి విద్వజ్జనమునకు అభిమానపాత్ర మగుటలేదు. ఆ నాటకములలో బహువిషయముల లక్షణ విరుద్ధాంశములు కలవు. భాషలో అపాణినీయప్రయోగములు అనేకములు కలవు. అది తనకును తెలియును. ద్రావిడపండితులకును ఎరుకయే. ఐనను అవి తనకును తానెరిగిన ద్రావిడవిద్వాంసులకును రసభంగము కలిగించుటకు మారుగా, ఒక యపూర్వమగు రుచియే కలిగించుచుండెను. నిత్యకర్మ లొనరించువారికి జాతాశౌచము వచ్చినప్పుడు తత్కర్మలనుండి విశ్రాంతి కలిగి వారిలో నలసులగు కర్మిష్ఠులకు కలుగు సుఖమువంటి సుఖ మది. ధర్మిష్ఠుడు స్వల్పవిషయములలో మధ్యమధ్య ధర్మాతిక్రమణము చేయుటవలెనే అంత గర్హ్యముగా నవి కనపడియుండలేదు. పైపెచ్చు ఆదరపాత్రము లగుచుండెను.

కాని యీ యాంధ్రదేశములో నట్లు కాదు! వారి దృష్టి యా దోషములపైననే ప్రసరింపసాగినది. వారు దోషైకదృక్కులా? కారే! అందులో వారికి మొహమోటము లేదు. మహారాజు లన్న వారికి భయము లేదు. రాజాస్థానములలో వారి కట్టి గౌరవము లుండెను. వారి ప్రవృత్తులు కూడ నంత పూజార్హములు!

కొప్పెరుంజింగడు పూర్వము నెల్లూర విజయాభిషేకము చేయించుకొనెను. ఆ సమయమున కేరళనటబృందమువారు కొప్పెరుంజింగని యాస్థానమున నతనితో వచ్చిన కవిపండితులయు, నెల్లూరుప్రాంతములనుండి యాహూతులై వచ్చిన కవిపండితఋత్విక్కులయు సమక్షమున రంగనాయకస్వామి యాలయప్రాంగణమున 'అభిషేక'నాటకము ప్రదర్శించుచుండిరి.

ప్రథమాంకము పూర్తికావచ్చుచుండెను. వాలికొరకై ఆచమనార్థము హనుమంతుడు నిష్క్రమించి జలము గొని తెచ్చెను. వెంటనే సామాజికులలో నాంధ్రపండితులు ఆశ్చర్యపడుచు లేచి సభలో నిలుచుండి యసహ్యము వ్యక్త మొనర్చిరి. ఆవెంటనే వాలిమరణము రంగముపై ప్రదర్శింపబడెను. రంగాదిపము స్తప్రుణ్యానదులను అక్కడ ఆవాహనచేసినను వారికి తృప్తికలిగింపలేదు. అది చూచి ఒక్కక్షణమైనను అక్కడ నిలువక ఒక్కుమ్మడిగా హాహాకారములు చేయుచు నా యాంధ్రపండితులు సభనుండి వెడలియే పోయిరి.

అది చూచిన కొప్పెరుంజింగనికి రోషావేశము కలిగినది. ఆ లేచిపోవుచున్న పండితమూర్తుల నతడు తిలకించెను. వారు అగ్నులవలె తేజోమూర్తులు; నిష్ఠయుతులు. వారి మూర్తులు చూచి యత డేమియు ననలేకపోయెను. తాను 'సాహిత్యరత్నాకరుడ'నని బిరుదము ధరించెనే! లక్షణవిరుద్ధాంశము ప్రదర్శింపబడినప్పుడు పండితులు ఏవగించుకొన్న తా నేమనగలడు!

ఆంధ్రదేశమునం దెచ్చటనైనను లక్షణభంశము కలిగినయెడల నిటువంటి సంఘటనలే సంభవించుచు వచ్చెను. రంగస్థలముపై యుద్ధము చూపినచోట్లను, క్రీడానిద్రాదులు ప్రదర్శించినపుడును, ఆంధ్రసామాజికులలో నిట్టి కలవరము బయలుదేరుచుండెను. చెరుకూరులో నిత్యాగ్నిహోత్రము లగు వేయిబ్రాహ్మణకుటుంబము లుండెను. అందులో వేదవేదాంగవిదులు బహుశతములుగా నుండిరి. ఆనాటి సభ దేవేంద్రసభవలెనే శోభాయమానముగా నుండెను. ఆ నాటకములో అపాణినీయప్రయోగములు వచ్చినవి. అవి విన్నప్పుడెల్ల ఆ యారిపండితులు చెవులు మూసకొని యావలికి వళ్లి యాచమనము చేసి వచ్చిరి. కొప్పెరుంజింగ డేమియు ననలేకపోయెను.

కృష్ణానది నుత్తరింపబోవుచు కొప్పెరుంజింగడు కొల్లూరులో విడిసెను. అంతమంది పండితప్రకాండు లున్న గ్రామము కృష్ణాతీరమున లేదు. అక్కడ కేరళనటులు ప్రతిమానాటకము ప్రదర్శించిరి. కొప్పెరుంజింగని యాహ్వాన మంగీకరించి యా యగ్రహారమునందలి పండితు లా నాటకము చూడ వచ్చిరి. ముందు సూత్రధారప్రవేశమునకే వారించుక యాక్షేపించిరి. స్థాపన పూర్తియైనది. అందులో నాటకప్రస్తావములో నందునట్లు కవిపేరు లేదు. 'ఇతడు అనామకుడా?' అని పరిహాసము వచ్చునట్లు హేళనగా నచ్చటివారు ప్రశ్నించిరి. ఆ పిమ్మట రామాయణకథాసందర్భము నంతగా మార్పుచేసి ప్రదర్శించుట యా పండితులకు రుచింపలేదు. 'రామకథ ఇంత మార్పు చేసియుండుటచే యీ కవి స్వనామగోపనము చేసికొన్నట్లున్నాడు!' అని వేసిరి.

కొప్పెరుంజింగనికి కోపము వచ్చినది. 'ఆంధ్రులు శుష్కమీమాంసకులు!' అని సభలో నాతడు చికాకుగా ననెను.

కొల్లూరలో నీ యశుభమైనతర్వాత కొంతకాలమువరకు అతడు సంస్కృతనాటకప్రదర్శనము నే చాలించెను. ప్రదర్శింపజేసినను ఆంధ్రపండితుల నందు కాహ్వానించుట మానుకొనెను.

ఇప్పు డాతడు గోదావరీతీరము సమీపించుచున్నాడు.

ఇక్కడ వేదవిదులు శాస్త్రకోవిదులు సరసులు మహాకవులు సహస్రాధికముగా నున్నారని యాతడు వినియుండెను. మరల సంస్కృతనాటక మొకటి యీ ప్రాంతముల ప్రదర్శింపజేసి, తన నాటకసమాజమువారు ఇక్కడి పండితులమెప్పు పొందవలెనని యతడెంతేనియు గాంక్షించెను. "పెన్నాతీరవాసులకు కొందర ఎక్కువ! కృష్ణాతీరపండితులకు తలలలో కృష్ణస్మృతిక హత్తుకొనిపోయినది! ఈ సప్తగోదావరపవిత్రతీరమునందలి పండితులట్లు కారు! ఈ వారి కావేవేనారివలెనే సద్ధమైనది. ఈ సీమ ప్రాంతవారు రసజ్ఞులు. ఇక్కడిపండితుల మెప్పుతో, నా భరతముల్లసాహిత్య రత్నాకరబిరుదములు స్థిరపరచుకొనవలెను"—అని విశేషముగా నాతనికి ఉబలాటము అతిశయించినది.

పుష్యమాసప్రవేశమునకు అతడు గోదావరిశాఖలలో నొకటియగు వసిష్ఠయొద్దరికి చేరుకొనెను. అప్పటికే త్రిపురాంతకుడు మోటుపల్లి పట్టుకొనిన వార్త యాతనికి తెలిసినది. కొలనిరుద్రుడు పిఠాపురమున విడిసిన వార్తయు తెలిసినది. ఇప్పుడు జన్నిగదేవుని సేనలు కదలుచున్న వార్తయు తెలిసినది. కాని యాతడు బహుధైర్యశాలి. అతనికి తన సేనపై నచంచలమగు విశ్వాసము కలదు. పైగా తనకు తోడుగా నెల్లూరు సుందరపాండ్యుని సేనలును, ఉత్తరమున కళింగసేనలును కలవు; వాని కన్నిటికి తోడుగా చోళసింహాబలము లున్నవి. ఇవి యేవియు లేకున్నను, తా నొక్కడే ఒకవంక జన్నిగను రెండవవంక కొలనిరుద్రుని ప్రతిఘటింపగలడు. ఆంధ్రసేన లన్న నొక లెక్క కాదు. తాను ముందు ఆంధ్రదేశపండితులను నిర్జింపవలెను. ఈ గోదావరీతీరవాసులగు పండితులకు తన యాస్థానవిద్వదతిశయము ప్రదర్శించి తన మహిమ ప్రకటింపవలెను. అప్పుడు గాని తన విజయయాత్ర సార్థకము కాదు!

అతడు వైకుంఠైకాదశి నరసాపురములో గడపదలచెను. అందు కాతడు ముందుగనే తన యాస్థానపండితు లందరను ఆనాటి సభకు జాగరూకులుగా నుండ నాజ్ఞాపించెను. ఆ ముక్కోటిఏకాదశిన శ్రీరాత్రి కేరళనటబృందమును 'ఊరుభంగ' నాటకము ప్రదర్శింప సిద్ధముగా నుండబంచెను.

ఆ నాడాతడుపవసించి పూజాదులతో గడపును. ఆ రాత్రికి నాటకప్రదర్శనము జరుగును. మరునాడు ద్వాదశిపారణ చేసి, మహాసభ చేసి విద్వాంసుల మహదాశీర్వచనము పొంది, వారిని వైభవముగా సత్కరించి తాను గోదావరి నుత్తరింప ప్రారంభించును. అందుకై యా చుట్టుపట్టుల నున్న వేదవిదులను పండితులను కవులను అందరను దశమినాటికే తన స్కంధావారమునకు రావలసినదని యాహ్వానము లంపెను.

ఆ యాహ్వానములును చిత్రమైనవి. అందులో గౌరవము కలదు. కాని వాని ననుసరించి పోకున్నచో శిక్షించునేమో యను భయముకూడ నందరకు కలదు. ఈ కొప్పెరుంజింగడు రావణాసురునివంటివాడని ప్రథ యొకటి వ్యాపించిపోయెను. అందుచేతనే ప్రతినాయకుల నుత్కర్షాతిశయములు వర్ణనముచేయు నాటకము లాతని కభిమానము లట్టియును నాటకయు వానిలో ప్రబలినది. ఏమైనను అతడు పండితపక్షపాతి! పండితుల నాతడు సత్కరించినట్లు ఇంకొకడు చేయలేడు. కాని కోపము వచ్చినచో నతడేమి చేయునో!—రావణాసురుడు!

భయమున నేమి, భక్తిచే నేమి, గోదావరీతీరమున గల వేదవిదులు, పండితులు, కవులు దశమినాటి సాయంత్రమునకే నరసాపురముసమీపమున కొప్పెరుంజింగని స్కంధావారమునకు చేరుకొనిరి. తణుకు, ఆచంట, పాలకొల్లు, ఆకివీడు, భీమవరము — ఇత్యాదిప్రదేశములనుండి పండితు లనేకులు వచ్చిరి.

ఆ వచ్చినవారిలో ఎఱ్ఱిగాలను నగ్రహారమున నుండి గ్రామణి యగు కేశన యను ఛాందసకవియు నొకడు!



# దోమల పుట్టుక

## ఆలుమగల తగవులలో, ఆవిర్భవించిన విషకీటకం

డాక్టర్ ఎల్విన్

పట్టణాల్లో దోమలబాధ పడనివాళ్లు అరుదు. ఈ దోమలన్నీ నాగరికతతో వచ్చిన ఎలక్ట్రిక్ దీపాలతోటీ, మురుగుకాల్వలతోటీ, ఇంటిమీద ఇల్లుగా ఇరుక్కుపోయి ఉన్న పట్టణాల ఇళ్ళ ఎక్కడివల్లా వచ్చాయని ఈకాలపు పూర్వీకులు చెప్తారు. రెక్కల రాక్షసులని ఈ రక్తపానంచేసే కీటకాలను ఆంగ్ల కవయిత్రులు వర్ణించారు. దోమలగుంపుల దాడివిధానం చూస్తే, హిట్లరు “దోమవిమానాలు (మాస్కిటో) ప్లెట్జుక్రీగ్ విమాన యుద్ధవిధానాలు కనిపెట్టి ఆరంభశూరత్వం చూపగలిగాడు. క్రిమబాంబులూ దోమలు నేర్పిన విద్యే! ఇంట్లో దోమలబాధ ఉంటే, ఆచిరాకుతో కాపురంలో మోతలు ఉండక తప్పవు. అయితే తగువులు పెంచవలసిన అల్లాంటిదోమలు ఆలుమగలమధ్య తగవుల్లగా ఉద్భవించాయని ఆదిమవాసులకథలు చెప్పుకోడం చూస్తే వింతగానే కనబడుతుంది. దోమలు కేవలం నవనాగరికతలోనే పుట్టాయన్న అపోహకూడా పోతుంది.

దోమలు ఎందుకు పుట్టాయో, ఎల్లా పుట్టాయో చెప్పే కథలు ఆదిమజాతుల వాఙ్మయంలో చాలానే ఉన్నాయి.

బిర్హోర్ జాతుల్లో ఒక కథ ఉంది. మహాదేవుడు ఒకసారి చాలాకాలం అడవికి పోయి, ఇల్లు పట్టకుండా తిరగడం ప్రారంభించాడట. ఇల్లా భర్త కోపించిపోయి ఇల్లుపట్టకుండా తిరగటం పార్వతీదేవికి కష్టంగానే ఉంది. చివరికి కోపం పట్టలేక మెడచుట్టూ ఉన్న మట్టిచేత్తో నలుముకొంటూ ఉప్పని ఊదిందట. ఆ మట్టి అంతా దోమలగుంపుగా తయారయి శిరవేగంతో ఎగిరి వెళ్లి మహాదేవుని, ఇంటికి వచ్చేదాకా పీడించసాగాయి. ఈదోమల పోరుకన్నా పెళ్లాం పోరే నయమనుకొని మహాదేవుడు పార్వతిదగ్గరకు చక్కా వచ్చాడు.

ఉరవనులలోనూ ఇల్లాటికథ ఉంది. అయితే చంద్రుడు నాయకుడు, భార్య మొగం చూడకుండా తక్కిన తారలను వెంటాడి తిరుగుతున్నాడు. భార్య కోపంవచ్చి, మెడ నలుగుతీసి దోమలను చేసి భర్తమీదికి దాడి పంపింది. అయితే దక్షిణనాయకత్వంలో చంద్రుడు, శివదేవుని తలదన్నినవాడు. తానూ ఇంతమట్టి వంటిని నలిచితీసి ఉప్పని ఊది తూరీగలను చేశాడు. ఆతూరీగలు దోమలను కబళించేశాయి. అలక తీర్చుకోటంలో పార్వతీదేవితో సాటి రాలేకపోయింది రోహిణి.

సవరలకథ ఇంకా సహజంగా ఉంటుంది. ఒక కోయదొర కోపంవచ్చి భార్యను చావ చితకకొట్టాడు. సరే, ఇల్లాలు మానం దాల్చి మూడంకె వేసి సత్యాగ్రహంలో బ్రహ్మాస్త్రము ఉపయోగించింది. మగవారికి కోపంలో చేసిన తప్పుకూ, చేశాకవచ్చే పశ్చాత్తాపానికి పోలికేలేదాయెను! కాళ్లావేళ్లాపడి ఒకమూడు రోజులు బ్రతిమాలాడు! ఊహు. పెళ్లాం మాత్రం అతని మొగంవంకన్నా చూడకుండా బిగుసుకూర్చుంది.

దిక్కుతోచక దేవుణ్ణి ప్రార్థించాడు. ఇల్లాలుకోపం ఎరిగున్నవాడేమో ఆమహాదేవుడు ఇట్టే దయదల్చి ప్రత్యక్షమయాడు. పిడికెడు ఊక తీసి దొరచేతికిచ్చాడు. “నీపెళ్లాం గదిలో నిద్రపోతూన్నప్పుడు ఈఊక ఆవిడమీద జల్లి, పరుగున బైటికి వచ్చి ‘తలుపువేశెయ్?’ అని ఉపదేశం ఇచ్చాడు. కోయదొర అల్లాగే చేశి చటుక్కున బైటికి వచ్చి తలుపు గొళ్లెం పెట్టాడు. ఇంక ఒక్కొక్క ఊకపాయా ఒక్కొక్కదోమగా అయి వొళ్లంతా పట్టుకుపీకుతూంటే, ఆకోయవాణి సత్యాగ్రహం అంతా ఇట్టే మటుమాయమై పోయింది. భరతనాట్య ఫణితిలో, గంతులు వేస్తూ, భర్తను తలుపుతీయమని ప్రార్థించింది. అల్లా ఆలుమగల మధ్య సామరస్యం కుదిర్చిపెట్టటానికి దోమలు జన్మించాయని సవరకథ.

గోండుల కథ వేరు. ఒక రాజు, సంతానంలేక భార్యాసమేతుడై యాత్రలకు బయలుదేరి, పుట్టలకు చెట్లకు మొక్కుతూ కనబడ్డ తీర్థం అల్లా సేవించి, కనబడ్డ సాధువుకల్లా మొక్కుతూవచ్చాడు. చివరికి ఒక సాధువు కరుణించి, “ఫలానా చెట్టునున్న మామిడిపళ్లల్లో ఏది ముందు క్రిందపడితే అది తీసుకొని నీభార్యచేత తినిపించావంటే సంతానం కలుగుతుం”దని చెప్పి దీవించి పంపాడు.

తీరా రాజు మామిడిచెట్టుదగ్గిరకు వచ్చేటప్పటికి ఆ చెట్టుచుట్టూ ‘యక్షితలు’ కాపలాకాస్తూ కూర్చున్నాయి. రాజుని చూడగానే ఆయక్షితలు కందిరీగల గుంపుగా మారి రాజును కుట్టటం మొదలుపెట్టాయి. రాజు పారిపోయి సాధువు శరణు చొచ్చాడు. ఆ సాధువు, తన ఆసనం దగ్గిరది ఇంత బూడిద తీసి ఉప్పని ఊదాడు. ఆ బూడిదఅంతా, కోట్లకొలది దోమల గుంపుగా మారిపోయింది. రాజు వెళ్లగానే మామూలు రూపాలు దాల్చిన యక్షితలమీదికి

(18-వ పేజీ చూడుడు)

# పట్టువదలని వేళ్లు

శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

ఎంతో ఆదుర్దాగా హోటలులోపలికి వచ్చిన శివరావుకు కాఫీ తాగుతున్నంతసేపూ తను చేస్తున్న పనిమీది ఆలోచనే లేదు. బిల్లు చెల్లించబోయేటప్పుడు తనకూ అయ్యరుకూ రాబోయే సంఘర్షణ తాలూకు ముందు నీడలు మనస్సు తెరమీద పలచగా మొదలై అంతకంతకూ దట్టమవుతున్నాయి.

తన జేబులో మిగిలిన ఆ ఒక్క పావలా కాసుకే ఎందుకొ గంటుండాలక్షరాల నైపుః తనకన్నా దరిద్రుడా కిళ్లీల రంగయ్య అంటగట్టాడిది నిన్న. మళ్లీ నేనిచ్చింది కాదని దబాయించాడు కూడాను. ఎంత మలకవగా అబద్ధమాడేవాడు? అసలు తానారోజే రెండు రూపాయల నోటుకి చిల్లరే ఇవ్వలేదన్నాడు! అంత చిల్లరలోనూ మంచివన్నీ చెల్లిపోయాయి గాని యీ గంటుపావలా మటుకు దరిద్రదేవతా చిహ్నంలా తన్ను వదలదలచుకున్నట్లు లేదు. పొద్దుటికి మిగిలిన పదణాలకీ చిల్లరలోనూ రెండిడ్డీలకీ కాఫీకి సిగరెట్లకు ఆరణాలు ఖర్చవగా మిగిలిన ఈ గంటుపావలాతో పదకొండు పన్నెండు గంటలకు వేసిన ఆకలిని తీర్చుకోడాన్ని కతడు చాలా మొహమాటపడి నాలుగు గంటల వరకూ వాచీ సిగరెట్లుపొగేస్త తిండిగా గడిపాడు. చివరకా సిగరెట్లూ నిండుకోగా ఏమిచెయ్యడానికీ తోచక వెర్రెత్తిపోతున్న అతనికి అయిదుగంటలు దాటేన దగ్గరనుండీ ఆకలి బాధకు తట్టుకోవడమసాధ్యమై, హోటలులోని కా గంటుపావలా ఆధారంమీదనే జొరబడవలసిన పరిస్థితి ఏర్పడింది.

తానైతే కాఫీ తాగుతున్నాడుగాని అయ్యారీ పావలా చెల్లదంటే, ఏం చేస్తాడు తను? అయినా ఏదో పొరపాటున చిన్న గంటు పడ్డంతమాత్రాన ఎందుకు చెల్లకపోవాలిది? పదిమందీ మామూలుగా పుచ్చుకుంటే మామూలు పావలా చెల్లుబడే దీనికీ ఉంటుందిగదా, ఎందుకిష్టపడరు మొరటు మనుషులు దీన్నంగీకరించడానికి? ప్రమాదవశాత్తూ తమకే చెయ్యో కాలో విరిగితే నానాబాధలుపడి లోటు తీరకపోయినా బాగుపడ్డ మనుషుని మళ్లా అన్ని పనులకీ తయారవుతారే వీళ్లు, చిన్న గంటు పడినంతమాత్రాన ఈపావలా నెంగిలాకు పాటివిలువైనా లేనట్లుగా ఎందుకు చూస్తారు?

అదీగాక తానేమీ తయారుచెయ్యలేదే దీన్ని! అన్నిటిలాగే ఇదీ రాజుగారి టంకసాలలోనే తయారైంది. ఎవడో ఏదో అజాగ్రత్తగా ఉన్నందుకు తనకా శిక్ష మధ్యను?

అయినా తనదిమటుకు కజాగ్రత కదూ? రంగయ్య చిల్లరిచ్చినప్పుడామాత్రం ఒంటిమీద తెలివి తన కెందుకు లేకపోవాలి? ఏమో, ఇలా మోసంచేస్తాడ నెవరికి తెలుసు! వాడిదగ్గరున్న అంత చిల్లరలోనూ ఎంచి ఏరి ఇటువంటి పావలా ఇస్తాడని తాను కలగన్నాడా?

తిండికి లేని తనలాటివాడే ఇంత మొహమాటపడుతున్నాడు గదా, అంతేంత డబ్బుంచుకున్నవాళ్లూ ఎందుకు చెప్పాలి? ఇటువంటి చెల్లనివే ముందు చెల్లించడానికి తంటాలుపడతారు? తన దగ్గిరేగాని మరో [illegible] పావలాకేఉంటే . ఇది [illegible] విసిరి పారేసి ఉండును వైదు కాలవలో!

ఊరికే అనుకోవడమే గాని తనుమటుకు సాగయ్యగలిగాడా నిన్నటినుంచి దీన్ని! డబ్బుమీద ప్రతీవాడికీ మమకారమను.



తన ఆలోచనలు పూర్తవలేదుగాని గాజుగ్లాసులో కాఫీమటుకు అయిపోయింది. ఉత్త గ్లాసుకూడా అఖరున మరోసారి పెదవుల తగిలించి పీల్చబోయి అడుగు మడ్డి తప్ప మరే ద్రవమూ నోటిలోనికి రానప్పుడు కాఫీ అయిపోయిదన్న విషయం గ్రహింపు వచ్చి లేచి నిలబడ్డాను

శివరావు. ఆగండం తప్పించే నిమిత్తం లంచంగా వేయిదేవుళ్ళకూ మొక్కులు|వల్నాడ్నా యతని మనసునుండి.

చేతులూ కాళ్ళూ వణుకుతూండగా పక్కజేబులోనికి చెయ్యి పోనిచ్చి తంచనాగా నిలబడ్డామని చేస్తున్న ప్రయత్నానికతని వేళ్ళకు తగిలిన పావలా ఒక్కటే భంగం కలిగించలేదు; వెనకనుండి కుల్లుబట్టల నాయరు కుర్రవాడి 'ఒక కాఫీ రెండణాలా' అన్న పోలికేకకూడా సహాయపడిం దందులో.

నెమ్మదిగా వణుకుతో అయ్యారు జేబులను చేరుకున్నాడు. దినమణిలో ఎవరో సినిమాతారఫోటో చూస్తూ దూరదేశంలో ఉన్న తన భార్యనుగురించి కాబోలు తీయని కలలయ్యారు కంటుంబట్టిగాని లేకపోతే తన జేబులోఉన్న గంటుపావలా భోగట్టా అది పైకి రాకుండానే కనిపెట్ట ఉండు నతడు-తన గాభరా చూస్తే. ఎందుకంత వణకడం తను! అతని పెదవులమీదికి నవ్వు వచ్చిం దనుకోకుండానే. ఒక పది సెకండ్లు ఆనవ్వు మాయం కాకుండానే ఒక్క ఉదుటున జేబులోని పావలా పైకి తోసి అయ్యర టేబుల్ మీద నిర్లక్ష్యంగా పడేశాడు, దేవునిమీద భారం వేసి. అయ్యరు పేపరుమీది తన దృక్కు లంతగా మరల్పకుండానే ఆ పావలా నెమ్మదిగా డ్రాయరులోని చిల్లరడబ్బుల కప్పులోనికి జార్చేశాడు- మిగిలిన డబ్బు నివ్వాలన్న స్పృహే లేకుండా.

చేత తమలపాకులకట్టలో చక్కని తొడిగినటుకే పైకి కనిపిస్తూన్న సగం పాడైన కుళ్లు తమలపాకులా ఆ పావలా తక్కిన డబ్బులతో కలిసిపోయి తనబొమ్మ ఉన్నమటుకే పైకి చూపెట్టుకున్న దిమాయికంగా. ధైర్యం వచ్చింది; మరింక బాధ లేదు. గట్టిగా దెబ్బాయించినట్లుగా అది గాదు. "తక్కిన అణాలు ఇవ్వవలసు మరో ట్రేడా మరి?" అని.

చిత్రితమైన సినిమాతార శరీరనిమ్నోన్నతరేఖలమీదనుండి దృష్టి మరలించుకుని అయ్యరుచేతితో రోల్డుగోల్డ్ ఫ్రేముకళ్ళజోడు నుదుటిపైకి తోసి, శివరావువైపు పాకసారి తీక్ష్ణంగా చూసి, ఫలహారాలరాకుదగ్గరున్న సెర్వరు నెంతయిందో అరవంలో ప్రశ్నించి సమాధానమందుకుని, ఎంతిచ్చాడో శివరావును కనుక్కుని అణాన్నర టేబిల్ మీద పడేసి మళ్లీ తన ఊహాలోకంలోనికి జారిపోయాడు.

శివరావు పైకి వచ్చి పక్కదుకాణంలో వాచీపెట్టొకటి పుచ్చుకుని అక్కడున్న అగ్గితాడుతో సిగరెట్టొక టంటించుకున్నాడు. కిళ్లీకొట్టు బల్లకట్టునుంచి రోడ్డుమీదకు దిగబోతూన్న అతన్ని ఇంచుమించుగా రాసుకుని వెళ్లిపోయింది ఎర్రని ధూళిపొర కుద్దరుకాలువాలా కప్పుకున్న లారీ ఒకటి.

ఇప్పు డేమిటి చెయ్యాడ మన్న ప్రశ్న ఇంకా అతని మనస్సులోనికి రాలేదు. కాఫీనీళ్లతోనూ సిగరెట్టుపొగలతోనూ అదుగున తొక్కబడంది తీరకపోయినా ఆకలి అప్పటికిమటుకు. కాళ్లు ఎలా తీసుకు వెళ్తే అలా వెళ్లడమే నిశ్చయంగాగల అతడు లారీనుంచి తప్పుకోవడంలో ఎండవైపుకు తిరగడాన్ని, ఆ సమవైపురోడ్డునే తిన్నగా నెమ్మదిగా నడిచి నడిచి రైలు స్టేషన్ చేరుకున్నాడు. అప్పటికి నాలుగు సిగరెట్లు పైకివచ్చి కాలిపోయాయి, ఒక దానినుంచొకటి తమప్రాణ తేజానికీ చావుకూ కారణమైన అగ్నిని సంగ్రహించుకుంటూ.

అయిదో సిగరెట్టు పైకి తీస్తున్నప్పుడు పెట్టె సగం ఖాళీ అయిం దన్న సంగతి స్ఫురణకు రావడంతో, ఇవయిపోతే మళ్లీ ఎలాగూ అన్న ప్రశ్న మనసులో తలెత్తి అతనా సిగరెట్టు వెనక్కుంచేశాడు భవిష్యదుపయోగంకోసం. అప్పు డతనికి జ్ఞాపకం వచ్చింది తన భవిష్యత్తే ఆరుసిగరెట్లు కాల్చే వారవేళంతవరకే కాదనీ, ఇంకా చాలా ఉందనీ.

ఏమిటి చెయ్యడం? అయిదురోజులనుండీ ఈప్రశ్న మాటిమాటికీ ఎదుటికి వచ్చి తన్ను నిలబెట్టూండడం, జేబులో మిగిలిన డబ్బు నూహాపథంలో గలగలలాడించి, దీన్ని వెనక్కు నెట్టుకొస్తూండడం జరుగుతున్నది. మరిప్పుడు?

తన తప్పువల్లో దురదృష్టంవల్లో పోయిం దుద్యోగం. పోగొట్టుకోవడం అతిసులభమేను, కాని సంపాదించడమూ? ఎక్కడా ఆ ఆశే ఫలించేటట్లు కనిపించటం లేదు. తను బతకడ మెలాగు? తన చావుబతుకుల్తో సంబంధం లేనట్లే ప్రవర్తిస్తున్న దీ లోకం. ఎవ్వరూ ఆత్మహత్య చేసుకోకూడ దని నిర్ణయించిన ఈ సంఘం తిండెందుకు పెట్ట దంవరికీ? తానే ఈవిధంగా ఆకలితో క్రమక్రమంగా చంపేస్తే తప్పులేదు కాబోలు!

ఆత్మహత్యా చేసుకుంటే? ఎవడూ విచారించేవాడు లేడు 'నా' అని చెప్పుకోదగ్గవాళ్లెవళ్లూ లేని తన చావుకోసం. కాని ఎందుకు చావాలి? బతకడానికి జడిసి పిరికితనంతో చనిపోతాడా తను? ఊహూ, చావడు.

పళ్ళి బెంచీమీద కూర్చున్నాడు.

చావకపోతే ఎలా బతుకు తెరువు? 'మూడో చ్చులే బతకలేకపోవు' అని ఎవరో చెవుల్లో అన్నట్లనిపించి ఉలికిపడి పక్కకు చూశాడు. ఎవరూ లేరు. కొద్దిదూరంలో ఎవరితోనో వాదిస్తూన్న ఎర్రచొక్కా లైసెన్సుకూలీతప్ప. తానూ కూలీ చేస్తే? ఆకూలి మొహంవైపే చూస్తుండగా వా డంటున్న మాటలు చెవిని జొరబడ్డాయి: "ఈపాలి గేటుదాటి నోప లడుగెట్టు, నయి వెంచులేని బక్కయెదవా, నరికేత్తా" అని. ఆకూలీ ఎదుట బిక్కమొగంతో నిలబడి ఉన్నాడు కుర్రవాడొకడు, హు— చివరకు కూలీ చేసుకోడానికీ ఎన్నో అడ్డున్నాయి!

ఈఊరు వదిలి వెళ్లిపోతే? అన్ని ఊళ్లల్లోనూ ఉద్యోగాలుకు కరువైపోతుందా? కానీ వెళ్ళడ మెలాగు? టిక్కెట్టుకు డబ్బు? పోనీ టిక్కెట్టులేకుండా వస్తే? అతనిగుండెలు టకటక కొట్టుకున్నాయి. ఎవడన్నా పట్టుకుంటేనో? ఎప్పుడో ఎవడో పట్టుకోవడం సంగతెందుకు? ముందా గేటు దాటివెళ్లడ మెలాగు, ఎర్రగా వలంగా ఉన్న ఆతురకటిక్కెట్ కలక్టరును తప్పించుకుని?

ఏవో వంక బెట్టి వెళ్ళొచ్చు, వస్తే?

ఈఊరు తన్ను మెడబట్టుకుని గెంటుతే తను నోరుమూసుకుని వెళ్లిపోవడమేనా? వెళ్ళడు. వచ్చినా బతికినా ఇక్కడే ఉండాలి.

ఉండాలి. ఉండాలి. ఉండాలి. చావకూడదు. బతికే ఉండాలి. కాని ఎలాగు?

సిగరెట్టు తీసి అంటించాడు, జంకి లాభం లేదు. ఏపని చేస్తెనా డబ్బు సంపాదించాలి, అపునుకాని, ఏపని చెయ్యడం. అప్పు కనుపించకపోతే దిక్కులు చూసే చంటి పిల్లాడిలా చూసేడు నలువైపులా! లేవబోయి మళ్లీ కూర్చుండిపోయాడు ఏమీ తోచక. ఏమి చెయ్యడం?

టిక్కెట్టు కొంటున్నా గెంతముందో కిటికీదగ్గర, ఒకరిమీద ఒకరు పడి, నానాఖంగారైపోతూ ఎందుకు చెప్మా ఇంత గాభరా-ఇంకా అరగంట టైమున్న బండి కోసం? చేతులూ కాళ్లూ విరక్కొడానికి

జేబులో పర్సులూ గిర్సులూ పోగొట్టుకోడానికి!

ఎవడిజేబులో పర్సన్నా తను లాగేస్తే? దొంగతనం!!

అతనికి ముచ్చెమటలూ పోశాయి. దొంగతనం! అమ్మ చిన్నప్పుడు చెప్పింది-ఏపనైనా చెయ్యిగాని దొంగతనంమాత్రం చెయ్యకు నాయనా—అని. తాను దొంగపని చెయ్యడమే!!! చెయ్యడు—తా నటువంటి పని ప్రాణంపోయినా సరే చెయ్యడు.

ఒక పావుగంట అలానే కూర్చున్నాడా బెంచిమీద. అలసిపోయినా ఆలోచించడం మానలే దతని మెదడు.

కడుపులో నొప్పేదో ఆరంభమైంది. చేత్తో నాలుగైదుసార్లు కడుపును నొక్కుకున్నాడు. నొప్పి తగ్గక అంతకంతకూ ఎక్కువవడం మొదలుపెట్టింది. అజీర్ణపు నొప్పికాబోలు —[illegible], జీర్ణించుకోడాని కేమన్నా ఎక్కువగా ఉంటేగా అజీర్ణం! అసలు ఖాళీ తనకడుపు. సిగరెట్టు తీసి కాల్చాడు. కొద్దిగా తగ్గినట్లయింది నొప్పి, కాని తగ్గినంతసేపు లేదు, మళ్ళీ మొదలైంది. ఏమీ తోచలే దతనికి. సోడా తాగుతే?

సోడా! డబ్బెక్కడిది? ముందు తాగేసి తరవాత డబ్బు లేదంటే? తన్నుకోవడం వరకూ వస్తుంది? తాను తన్నులు తినడమా? సోడా తాగినా నిజంగా ఎలాగూ తగ్గదీ నొప్పి. ఎందు కా అనవసరపు అవస్థ!

లేచి నెమ్మదిగా వెళ్ళి టిక్కెట్లకిటికీ కివతలగా ఉన్న కర్రకమ్మీల నానుకుని నిలబడ్డాడు. తనకే ఆశ్చర్యమైంది ఎందుకొచ్చా నిక్కడికని, భయం వేసింది. వెనక్కు వెళ్ళి బెంచీమీదే కూర్చుందా మనుకున్నాడు గాని ఆకమ్మీల నానుకుని పొందుతున్న సుఖం వదలి వెళ్ళడానికి నీరసంగా ఉన్న దేహం ఒప్పుకోలేదు. అక్కడే నిలబడ్డాడు. ఇంతమందిలోనూ జేబులో కానీకూడా లేనివాడు తానొక్కడే కాబోలు! ప్రపంచం మీద దిక్కులేని క్రోధం వచ్చిం దతనికి.

మళ్ళీ కడుపునొప్పి మొదలైంది. అతని మనస్సు చివరకు ఓడిపోయి ఒప్పుకుంది అది ఆకలివల్ల వస్తూన్న నొప్పేనని. ఆకలి తీర్తేనే గాని తగ్గ దిది

ముష్టెత్తుతే? ఎవ డిస్తాడు ధర్మం? దుక్కలా వున్నావు, ఏదన్నా కూలీ చేసుకోకూడదా అని దెప్పి పొడుస్తారు పైగా. తా నెన్నిసార్లనలే దమాట! అయినా నోరు తెరిచి మరొకర్నిలా దేవురించి అడగడం! వసవప్రాణం పోతే సుఖమంతకంటే.

ఆక్కడున్న అందరివైపూ పరికించి చూశాడు. ప్రతీవాడూ పక్కవాడి ననుమానంతో చూస్తూ, పర్సో, డబ్బో ఉన్న జేబును జాగ్రత్తగా ఒక చేత్తో పట్టుకుని మరి ఎగబ్రాకుతున్నారు టిక్కెట్లకోసం. జేబు దొంగతనమూ అంత సులభమైన పని కాదని స్ఫురించిం దతనికి. అప్పుడే తనవైపు నలుగురైదుగురు చూస్తున్నారదోక రకంగా, చేతిలో డబ్బు పట్టుకోకుండా, ఆగుంపులోపలకు వెళ్ళేప్రయత్నమే చెయ్యకుండా పనిలేని వీ డెందు కిక్కడ నిలబడ్డాడా అని కాబోలు? లాభం లేదు. తను దొంగతనం చెయ్యదల్చుకున్నా అవకాశం లేదు.

అక్కడనుండి కదిలి వెళ్ళి అవతల పెద్ద క్లాసు టిక్కెట్లకిటికీ దగ్గర స్తంభానానుకుని నిలబడ్డాడు శివరావు. అక్కడంతగా రద్దీ లేదు. ఉన్న యిద్దరిలో ఒకరు టిక్కెట్టు పుచ్చుకుని వెళిపోగా రెండోఅతను పర్సు పైకి తీసి కిటికీలోపలికి తొంగి చూస్తూ. "ఒకటి, బెంగుళూరు"అంటున్నాడు. శివరావాపక్కకు కొద్దిగా జరిగాడు. పదిరూపాయలనోటొకటి పైకి లాగి పర్సు లోపలి జేబులో పెట్టుకొని, ఆనోటును కిటికీలోపలి కందిచ్చాడా పెద్దమనిషి. లోపలినుండి మాటలు వినవస్తున్నాయి: "ఒక్క నిముషముండండి. బ్లాంక్ టిక్కెట్టు రాయాలి. ఇంకా తొమ్మిదణా లొస్తాయి సూర్!"

ఆపెద్దమనిషి మళ్లీ పర్సుతీసి చిల్లరడబ్బులులోపలి బుకింగ్ క్లర్కు కందిచ్చి, ఈసారి పర్సును పరధ్యానంగా కోటుపక్క జేబులోనికి తోసి నిలబడ్డాడు—థర్డుక్లాస్ కిటికీదగ్గిర జనాన్ని చూస్తూ నిర్లక్ష్యంగా. తనచూపులకు వెనక నుండడంవలన పక్కనున్న శివరావు నతను గమనించనేలేదు.

ఆకలి నిండిన శివరావు చూపులు ఆపెద్దమనిషికోటుజేబుమీదకు వెళ్ళాయి. వదులుగా సగం పైకి ఉన్న పర్సతని వేళ్ళ నాహ్వానిస్తున్నది. కాని ఒక సెకండుపాటతనికి సాహసం కలగలేదు. అటూఇటూ చూశాడు. ఎవ్వరూ తనవైపుకు చూడడంలేదు. ఆపర్సును లాగుకుని స్తంభం అవతలికి వెళ్ళిపోతే?

దొంగతనం !

చెయ్యకూడదు. కానీ...ఆకలి? నొప్పి? తన బదుకు తెరవు? ఆయనవెనక్కు తిరిగి చూస్తే? పట్టుకుంటాడు; "దొంగ, దొంగ" అని అరుస్తాడు; నలుగురూ మూగుతారు; పోలీసులు వస్తారు. తన్ని లాక్కెళ్తారు; నాలుగు తన్ని. పోనీ అప్పుడన్నా తిండి దొరుకుతుందిగదా! న్యాయంగా వున్నన్నాళ్ళూ తిండిపెట్టని ప్రపంచం మోసగాళ్ళకూ, దొంగలకూ మాత్రం తిండి కొధారం ఉంచింది జైలులో. అక్కడకొన్నాళ్ళుండి వచ్చాక ఆలోచించొచ్చు ఏమి చెయ్యడమో.

టపమని ఆలోచన తెగిందో లేదో అతని వేళ్లు మెరపులా ఆపర్సును పైకి లాగి తన జేబులోనికి జార్చేశాయి. ఆపెద్దమనిషి వెనక్కు తిరగనూలేదు. "దొంగ, దొంగ" అని కేకవెయ్యనూ లేదు. శివరావు కాశ్చర్యం వేసింది, ఇంత అజాగ్రత్తగా ఏలా ఉంటారు చెప్మా మనుష్యులని.

ఇంతలో అతని కేదో చెప్పరాని భయమైంది. తాను జైల్లోకి వెళ్ళడమా! ఆ నిలువుగళ్ళచట్టా, ఆకటకటాలూ!!

ఎంత సిగ్గుచేటు!!!

అతనికాళ్లతన్ని నెమ్మదిగా స్తంభం వెనక్కు లాగాయి. అక్కడినుండి వేగంగా నడిచి, మెయిన్‌రోడ్డుమీది మనుష్యుల్లో కలిసిపోయాడు ఒక అరనిమిషంలో అతను.

* * *

బెదురుతూ బెదురుతూ నెమ్మదిగా పార్కులోపలికి జొరబడి నిర్జనంగా ఉన్న జాగాలో ఒక రాతి అరుగుమీద ఎలక్ట్రిక్ లైటుకు దగ్గరగా కూర్చుని పర్సు పైకి తీశాడు శివరావు. అంతవరకూ అందులో ఎంతుందో చూడనేలేదు, అయ్యర్ హోటల్లో పెరట్లో ఎవ్వరూ చూడకుండా ఆపర్సు పైజేబులో నుండితీసిన రెండురూపాయలనోటొకటి తప్ప. వణికిపోతున్న వేళ్ళతో పర్సు విప్పా డతను.

మడతపెట్టిన కాగిత మొకటి రెండు విజిటింగ్ కార్డులు, బస్సుటిక్కెట్టొకటి, బెంగుళూరులో ఎవరిదో పెన్సిల్‌తో రాసిన అడ్రెస్సు గల కాగిత మొకటి, రెండు పది రూపాయలనోట్లూ, మూడు అయిదురూపాయలనోట్లూ, ఆరు రెండురూపాయలనోట్లూ, నాలుగు రూపాయనోట్లూ, రెండురూపాయల ఏడణాలు చిల్లరా అందులో అతనికి కనిపించిన వస్తువులు. అంతడబ్బొక్కసారిగా ఈమధ్య నెప్పుడూ అతడు చూడలేదు. ఒక అయిదు నిముషాలు తన ఒళ్లో కుప్పగా

(31 వ పేజీ చూడుడు)

### భారతరాజకీయ చరిత్రలో గణుతికెక్కిన

# లార్డ్ వేవెల్



ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఐచ్ఛికంగానో, ఇష్టరహితంగానో భారతదేశవిభజనకు లార్డు వేవెల్ దోహదమిచ్చాడనే అభిప్రాయం మన చరిత్రలో స్థిరపడిపోయింది. భారతదేశాన్ని పరిపాలించిన మొత్తం 26 మంది వైస్రాయిలలో వేవెల్ 25వ వాడు.

ద్వితీయప్రపంచసంగ్రామ కాలంలో జపాన్ దండయాత్రలు ఉధృతమై భారతదేశానికి ప్రమాదం సంభవించనున్న సూచనలు కానవచ్చినసమయంలో సైనికాధిపతిగా పేరు పొందిన వేవెల్‌ను వైస్రాయిగా నియమించారు. అప్పటికి భారతదేశంలో కాంగ్రెస్ నాయకులందరూ కారాగారబద్ధులైనారు. కాంగ్రెస్ సహాయం లేనిదే బర్మాలోవలె భారతదేశంలోకూడా బ్రిటిష్ పరిపాలకులకు పరాజయం తప్పనిసరి అనే భావం ఇంగ్లండ్‌లో బలపడింది. రాజకీయతంత్రంవల్ల కాంగ్రెస్ సహకారాన్ని సాధించడమో, లేక ప్రజోద్యమాలను నిర్దాక్షిణ్యంగా అణచివేయడమో తేల్చుకోవలసిన తరుణం బ్రిటిష్‌ప్రభుత్వానికి ఆసన్నమయింది. అందువల్ల బ్రిటిష్ రాజరికవిధానాన్ని సమగ్రంగా అవగాహన చేసుకొని నిర్వహించగలిగేవాడు, అతిసాగనిపక్షంలో సైనికబలాన్ని ప్రయోగించి ప్రజల్ని లొంగదీయగలిగేవాడూ భారతప్రభుత్వనిర్వహణకు అవసరమైనాడు.

ఈజిప్టులో వివిధరాజకీయపక్షాల మధ్య సమస్యలను [illegible]గా తీసుకొని బ్రిటిష్ ప్రాబల్యాన్ని స్థిరపరచగలిగిన లార్డు ఎలెన్బీకి శిష్యుడని పేరుగన్నవాడు ప్రాచ్యదేశాలలో వివిధయుద్ధరంగాలలో బ్రిటిష్ సైన్యాలకు అధిపత్యం వహించి సమర్ధుడని పేరు పొందినవాడు జనరల్ వేవెల్‌కంటె అర్హుడు మరొకడు లేడు. అదీ కాక క్రిప్స్ రాయబారాల సమయంలో భారతదేశ సర్వసైన్యాధిపతిగా పనిచేసి, సమాలోచనల్లో భారత కాంగ్రెస్ నాయకులతో వేవెల్ పరిచయ మేర్పరచుకున్నాడు. దీనిని బట్టి అప్పటికే బ్రిటన్‌లోని చర్చిల్ ప్రభుత్వానికి వేవెల్‌ను భారతదేశస్థితిని కాపాడ్డానికి నియమించదలచినట్లు గోచరిస్తుంది. తరుణం రాగానే ఫీల్డ్ మార్షల్ సైనికపదవినిచ్చి వైస్రాయిగా నియమించారు.

ఈజిప్టులో లార్డు ఎలెన్బీ ఏవిధానాన్ని అవలంబించాడో, అదే విధానాన్ని భారతదేశంలో అవలంబించాలని వేవెల్ ప్రయత్నం చేశాడు.

అధికారరక్షణసమస్య వచ్చినప్పుడు సామదానభేదదండోపాయాలలో దేనినైనా సరే ప్రయోగించడానికి జంకకూడదనీ, అన్య హేతువులు ప్రధానం కారాదనీ వేవెల్ ఎలెన్బీల తత్వంలో ముఖ్యసూత్రం. అంటే ప్రజలలో కలగగల అభిప్రాయాలు, అసంతృప్తి, దేశవాసుల క్షేమం మొదలైనవి ప్రధానం కావన్నమాట. వేవెల్ స్వయంగా భారతదేశాన్ని విభజించాలని కోరాడో లేదో అతని ఉపన్యాసాలవల్ల గ్రహించడం కష్టం. కాని పైతత్వానికి, అనుగుణమైన అతని చర్యలే చివరికి దేశవిభజనకి హేతువులైనాయని నిష్కర్షగా చెప్పవచ్చును.

ఆంగ్లో - ఇజిప్షియన్ వ్యవహారాలలో పరిస్థితులు విషమస్థితికి వచ్చినప్పుడు బలప్రయోగం చెయ్యడానికి లార్డు ఎలెన్బీకి చాలినంత సైనికబలం ఉంది. బలప్రయోగానికి అతను విముఖుడు కూడా కాడు. కాని ఆసమస్యల పరిష్కారానికి సైనికబలప్రయోగం నిష్ప్రయోజనమని అభిప్రాయపడ్డాడు. బల ప్రయోగం చెయ్యకుండా "తరుణంకోసం నిరీక్షించాలని నా ఉద్దేశం. ఈజిప్షియన్లు వారి రాజకీయ కక్షల్ని వారే పరిష్కరించుకోవాలని నా కోరిక. యూరోపియన్ల మాన ప్రాణాలకు ప్రమాదం సంభవిస్తే తప్ప నా సైన్యాలతో నేను జోక్యం చేసుకోదలచలేదు" అని లార్డు ఎలెన్బీ చెప్పినట్లు వేవెల్ వ్రాశాడు.

బెంగాల్లో వేవెల్ సరిగ్గా ఇదే విధానాన్ని అవలంబించినందువల్ల దేశవిభజన అనివార్యమయింది.

ఒక వ్యవహారవిధానాన్ని నిర్ణయించవలసినప్పుడు అన్యపక్షం వారితో ఎన్నడూ బేరాలు చెయ్యకూడదనేది ఎలెన్బీ సూత్రాలలో ముఖ్యమైనదని కూడా వేవెల్ వ్రాశాడు. ఎందువల్లనంటే బలహీనులైనవారే బేరాలాడతారు. బలవంతులైనవారికి ఔదార్యంతో కూడిన నిశ్చలత్వం ఉండాలి. ఏదమియ్యవలసినప్పుడు భారీగా దానంచేసినట్లుండాలి. ఈతత్వం మొదటి సిమ్లాసమావేశంలో పూర్తిగా ప్రదర్శితమయింది. ప్రతిపక్షులుకూడా బలవంతులైతే ఈ పద్ధతి ఆట్టే పనిచెయ్యదని తెలిసివచ్చింది.

కాని వాస్తవంగానే వేవెల్ తరుణానికోసం నిరీక్షించాడు. మొదటి సిమ్లా సమావేశం విఫలమైనందుకు చింతించలేదు. బ్రిటిష్ మంత్రిత్రయరాయబారం ఆదిలో విఫలమైనందుకు చింతించలేదు. దేశంలో పరిస్థితులు విషమించినప్పుడు మొదటి సూత్రాన్ని ప్రయోగించాడు. కాంగ్రెసే లొంగివచ్చింది. అయితే బ్రిటన్‌లో ప్రభుత్వం మారినందువల్ల పరిణామాలు వేవెల్‌కు రుచించలేదు. అందువల్ల వైస్రాయిపదవికి రాజీనామా నిచ్చి వెళ్ళిపోయాడు:

మౌలానా ఆజాద్ చెప్పినట్లు దేశవిభజనకు వేవెల్ అంగీకరించి ఉండకపోవచ్చును. కాని భారతదేశంలో బ్రిటిష్ వారి ప్రాబల్యాన్ని పాలనాధికారాన్ని సంరక్షించడంకోసం వేవెల్ అనుసరించిన పై రెండుసిద్ధాంతాలే దేశవిభజనకు దారితీశాయి.

వేవెల్ 1943 జూన్ 19వ తేదీన వైస్రాయిపదవిని స్వీకరించాడు. 1942 ఆగస్టులో కారాగారంలో పడగా మిగిలిన కాంగ్రెస్ నాయకులకు, అన్యపక్షనాయకులకు రాజకీయసమస్యాపరిష్కారనిమిత్తం సమాలోచనలు,

రాయబారాలు, సమావేశాలు జరపడానికి ప్రచ్ఛన్నంగా ప్రోత్సాహమిచ్చాడు. యుద్ధంలో జపాన్‌కు విరుద్ధంగా చేరి బ్రిటిష్‌పాలకులతో సహకరించే పక్షంతో రాజకీయపక్షాల నాయకులను చేర్చి పరిపాలనా బాధ్యతలో కొంతవంతును ఒప్పగించగలడని తెలిపాడు. సంగ్రామం సమాప్తి చెందేవరకు వేవల్ ఈ షరతును విడిచిపెట్టలేదు. 1914 లో గాంధీజీని విడుదల చేసినప్పుడు, భూలాభాయ్ దేశాయ్—లియాఖత్ ఆలీ ఖాన్ ఒప్పందం జరిగినప్పుడు మొదటి సిమ్లాసమావేశంలో ఈ షరతును అంగీకరిస్తేనే సమాలోచనలు సాగడానికి అంగీకరించగలనని పట్టుబట్టాడు. దేశాయ్ లియాఖత్ ఆలీ ఒప్పందం ప్రకారమే 1945 మేలో కాంగ్రెసు నాయకు లందరినీ విడుదల చేశాడు. జూన్‌లో మొదటి సిమ్లాసమావేశం జరిగింది. పాలకసలహావర్గంలో (వైస్రాయిస్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్) ఆ పక్షంవారిని ఎంతెంతమందిని ఎవరెవరిని చేర్చుకోవాలో తనకే తుదినిర్ణయమని పట్టుబట్టాడు. దానితో సమావేశం విఫలమయింది. కాని భారతరాజకీయసమస్యాపరిష్కారానికి ఏవో కొన్ని ప్రతిపాదనలు పెట్టి సమాధానం కోసం కృషిచెయ్యవలసిన అగత్యం ఉందని చర్చిల్ ప్రభుత్వంచేత ఒప్పించి రావడమే వేవల్ భారతదేశానికి చేసిన మరువరాని సేవ అని కొందరంటారు.

ఆపైన బ్రిటన్‌లో ఎన్నికలు జరిగాయి. చర్చిల్ ప్రభుత్వం పోయి సోషలిస్టుప్రభుత్వం వచ్చింది. వచ్చినా "రాజకీయ వ్యవహారాలలో కన్సర్వేటివ్‌లెంత ఘటికులో లేబర్‌పార్టీవారు అంతే ఘటికులు" అని లార్డ్ ఎలెన్బ్బి చెప్పినట్లు వేవల్ తనగ్రంథంలో వ్రాశాడు. భారతదేశంలో తమప్రాబల్యాన్ని స్థిరపరుచుకోడానికి తంత్రం పన్నడంలో ఇది నిజమేనని గ్రహించిన వేవల్ తన కృషిని కొనసాగించాడు. బ్రిటిష్‌సోషలిస్టు ప్రభుత్వంకూడా వేవెల్‌ను బలపరిచింది. అధికారం స్వీకరించగానే సోషలిస్టుప్రధాని అట్లీ భారతదేశంలో ఎన్నికలు జరిపి, రాజ్యాంగస్వరూపభవిష్యన్నిర్ణయానికి కృషిచెయ్యగలరని వాగ్దాన మిచ్చాడు. ఆ ప్రకారం మంత్రిత్రయరాయబారం వచ్చింది. రాజ్యాంగ భవిష్యన్నిర్ణయానికి భారతదేశ రాష్ట్రాలను మూడురకాలు విభజించాలని సూచించారు. కాంగ్రెస్, ముస్లింలీగ్ కూడా నిరాకరించాయి. కాని ఎన్నికల్లో పాల్గొన్నాయి. ఎన్నికలఫలితాలను, ఆర్థికపరిస్థితిని గమనించిన బ్రిటిష్ ప్రభుత్వం, రాజ్యాంగపరిషన్నిర్మాణానికి ఒడబడింది. పాలనాధికారాన్ని పూర్తిగా దేశీయపక్షాల కివ్వడానికి అంగీకరించింది. 1946 సెప్టెంబర్‌లో నెహ్రూప్రభుత్వం నిర్మాణమయింది.

ఈలోగా పైనచెప్పిన మొదటిసూత్రాన్ని అమలుజరపడానికి వేవెల్‌కు అధికారం లభించింది. 1946 ఆగస్టులో కలకత్తాలోనూ సెప్టెంబర్ అక్టోబర్లలో నౌఖాలీ, త్రిపురాలలోనూ అక్టోబర్ నవంబర్లలో బీహార్‌లోనూ మతకలహాలు సంభవించాయి. నెహ్రూ పటేల్ ప్రభృతులు అధికారంలో ఉన్నప్పటికీ కలహాల నణచడానికి అవకాశం లేకపోయింది. వేవెల్ తనకు తగినంత అధికారబల మున్నప్పటికీ, సైనికబల మున్నప్పటికీ జోక్యం చేసుకోలేదు. కలకత్తాలో సుహ్రావర్ది ప్రభృతులు అధికారాన్ని దుర్వినియోగపరిచి ప్రజలపై అమానుష హింసాకాండ జరిపిస్తున్నప్పుడు బెంగాల్ గవర్నరు నోరెత్తలేదు. అరాచక నిర్మూలానికి తన అధికారాన్ని ఉపయోగించలేదు. నిరాయుధులైన ప్రజలపైన, ముఖ్యంగా స్త్రీలపైన అత్యాచారాలు చేస్తున్నప్పటికీ, "ప్రత్యక్షచర్య" రాజకీయఫలాపేక్షతో ముస్లింలీగు తలపెట్టిందికాబట్టి, ఎలెన్బ్బి రాజనీతి సిద్ధాంతం ప్రకారం బ్రిటిష్ నాగరిక పాలకవర్గం జోక్యం చేసుకోలేదు. ఈవిధానాన్ని గమనించినపండిట్ నెహ్రూ పాలనాధికారంలో ప్రధానమంత్రిస్థాయికి సమానమైన పదవిలో" ఉన్నప్పటికీ వైస్రాయిని అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సమావేశంలో బహిరంగంగా విమర్శించాడు. సర్దార్ పటేల్ వేవెల్‌పైనా లీగ్ నాయకులపైనా కారాలు మిరియాలు నూరాడు. కాని ఇవన్నీ నిష్ఫలమైనాయి. ఇంక వేవెల్ ఈపరవడినే పోతూఉంటే దేశాని కింకెంతటి అనర్థం వాటిల్ల గలదో అనే చింతతో కాంగ్రెస్ ముస్లింలీగ్‌కి లొంగిపోక తప్పింది కాదు. 1946 అక్టోబర్ 26 వ తేదీని లీగ్ "మంత్రివర్గం"లో ప్రవేశించింది.

ఈసమయంలో వేవెల్ తంత్రానికి కాంగ్రెస్ లొంగి ఉండకపోతే ఏమయ్యేదో తెలియదు. దేశవిభజన జరిగి



గ్రిఫిత్ స్టేడియంలో బేస్‌బాల్ పందాలు ప్రారంభించిన అమెరికన్ అధ్యక్షుడు ట్రూమన్

ఉండేది కాదని కొందరి అభిప్రాయం. ప్రభుత్వంనుంచి కాంగ్రెస్ నిష్క్రమిస్తే దేశపరిపాలనను వేవెల్ ముస్లింలీగ్‌కు ఒప్పగించేవాడే. అప్పుడు బ్రిటిష్ పాలకుల లాఠీ, ఛార్జీలు, తుపాకి కాల్పులకు బదులు ముస్లిం లీగ్ అధికారదుర్వినియోగాన్ని ఎదిరించవలసివచ్చేది. బ్రిటిష్ సైనికబలాలకు భీతి చెందని సత్యాగ్రహులు లీగ్ దురంతాలకు భీతిచెందిపోయారనేది నిర్వివాదాంశం. అందువల్లనే రాజ్యాంగపరిషత్సమావేశ సమయంలో ఒక వంక మతకలహాలకు లోలోన కుమిలిపోతున్నప్పటికీ లీగ్‌తో సఖ్యతకోసం కాంగ్రెస్ నాయకులు శతవిధాల యత్నించారు. అల్పసంఖ్యాక వర్గాలకు అపూర్వ సదుపాయాలు కల్పించచూపారు. కాని వేవెల్ సిద్ధాంతాల పుణ్యంవల్ల తమ "ప్రత్యక్షచర్యలు" ఫలిస్తున్నంత కాలం లీగర్లు సఖ్యతను అంగీకరించడంవల్ల.

ఈతరుణం చూసి రాజ్యాంగ పరిషత్సమావేశం ఆశయాన్ని భగ్నపరచాలని వేవెల్ ప్రయత్నించాడు. బ్రిటిష్ ప్రభుత్వం కూడా అదే దురుద్దేశంతో పూర్వ మిచ్చియున్న రాజ్యాంగ సదుపాయాలను (రాష్ట్రాల త్రివర్గ విభజన, తద్వారా బ్రిటిష్ప్రాబల్య సుస్థిరతా సాధనం) తిరిగి ఇవ్వచూపారు.

అయితే ఇక్కడ వేవెల్ భావించిన ఎత్తు ఒకటి, బ్రిటిష్ సోషలిస్టు ప్రభుత్వం భావించిన తంత్రం మరొకటి అయింది. ఇప్పటిలో మాదిరిగా ఆర్థిక సైనికప్రాబల్యం భారతదేశంలో స్థిరపడానికి ఒక ఇండో - బ్రిటిష్ ఒడంబడిక చేసుకోవాలని వేవెల్ సూచించాడు. కాని భారతదేశంనుంచి సైన్యాలతో సహా సర్వ అధికార చిహ్నాల్నీ తొలగించి, దేశవిభజనద్వారా తమ ఆర్థిక ప్రాబల్యాన్ని భారతదేశంలో సుస్థిర పరచాలని సోషలిస్టుల ఆశయం. దేశవిభజనను కాంగ్రెస్ చేత ఒప్పించాలనే ఉద్దేశంతో 1948 జూన్ ఆఖరులోగా బ్రిటిష్‌వారు భారతదేశంనుంచి నిష్క్రమించ దలిచారని అట్లీ 1947 ఫిబ్రవరిలో ప్రకటించాడు. వేవెల్ జోక్యం చేసుకోకూడదనే సిద్ధాంతానికిది తోడై, కాంగ్రెస్ చేతులు కట్టుబడి పోయినాయి. దేశవిభజన అనివార్యమయింది. కాని తేదీ నిర్ణయించి నిష్క్రమించగలరంటే మతకలహాలు చెలరేగడమే కాకుండా, బ్రిటిష్‌వారి ప్రాబల్యం నిలవజాలదనే అభిప్రాయంతో వేవెల్ వైస్రాయి పదవికి రాజీనామానిచ్చారు.

చివరికి ఆర్థిక ప్రాబల్యం (తాత్కాలికంగా కైనా) నిలుపుకోగలగడంలో బ్రిటిష్ సోషలిస్టుల అంచనామూ రూఢయింది. కాని ఈప్రాబల్యం శాశ్వతంగా స్థిరపడాలంటే పాకిస్తాన్‌ను బ్రిటిష్‌వారు బలపరచాలని గ్రహించిన వేవెల్ ఇంగ్లండులో తన తుదిక్షణంవరకూ పాకిస్తాన్ పట్ల పక్షపాతభావంతో ప్రవర్తించాడు.

తన సిద్ధాంతాలవల్ల పరోక్షంగా భారత దేశవిభజనకు తోడ్పడి భారతదేశ రాజకీయ చరిత్రలో మరువరాని గణనకెక్కిన వేవెల్ మే 24వ తేదీ బుధవారమునాడు లండనులో 67వ ఏట మృతిచెందాడు.

---

# దోమల పుట్టుక

(12 వ-పేజీ తరువాయి)

ఈ దోమలగుంపు దాడివడలి వాళ్ల ఒళ్లంతా కుట్టడం మొదలు పెట్టాయి. యక్షితులు దోమలతో సతమతమవుతుండగా రాజు పల్లగా చెట్టుమొదలుకు పోయి తనకు కావలసిన మామిడిపండు తెచ్చుకొని సఫలీకృతుడయాడు.

ఇంకా కొన్ని జాతుల కథలలో సృష్టి నిర్మాణంలోనే, దోమలు పుట్టడం జరిగిందని కథలున్నాయి. ఒరిస్సాలో భట్టుల కథ ఒకటి ఉంది. విశ్వకర్మ భూతసృష్టికి, కమ్మరపుకొలిమిలో, లోహాలను కాల్చి సమ్మెటపోట్లు పెడుతున్నాడట. ఆరేగిన నిప్పురవ్వలు చెమటపట్టిన అతని దేహంమీద పడి చిటచిటలాడిస్తూంటే, చేతితో తుడిచేటప్పటికి దోమలై కుట్టిపోయాయి. విశ్వకర్మ చేత్తో వాటిని చూసి, ఒక సంచిలోపవేసి సంచీమూతి బిగించాడు. దోమలకు ఆకలి వేసి, తమను వదిలిపెట్టమని విశ్వకర్మను ప్రార్థించాయి. ఆయన సంచీమూతి విప్పాడుగాని, ఆయన్ని కరవకుండా, మానవుల రక్తంమాత్రం తాగి బ్రతుకుతామని వాట్లచేత ప్రమాణం చేయించుకొని వదిలాడు.

కోలుబలలో నమ్మకం, మహాదేవుని వంటి బూడిద నేలకు రాలినప్పుడు సర్వసృష్టికాది క్రిమికీటకాలతో, దోమలూ నల్లులూ కందిరీగలూ మొదలైనవన్నీ పుట్టుకొచ్చాయని.

గోండులలో కథప్రకారం, మొట్టమొదటి దోమను "నిరంతకీ"దేవి (పృథివీమాత) పుట్టించిందట. కథ ఇల్లా ఉంటుంది.

పూర్వకాలంలో ప్రపంచం పుట్టినప్పుడు మానవులంతా పగలు పనిచేసి రాత్రంతా చీకుచింతా లేకుండా, ఏవిధమైన నిద్రాభంగం లేకుండా, మర్నాటిప్రొద్దున్న దాకా హాయిగా నిద్రపోతూండేవారు. మనుష్యులకు ఇల్లా హాయిగా ఉంటే మదం, గర్వం ఎక్కువౌతున్నాయని, భూమాత నిరంతకీ దేవి విచారించింది. చివరికి 'ఈపొగరుతో వీళ్లు తనకే ఎదురుతిరుగుతారేమో ఎల్లాగా!' అని ఆలోచించింది. వీళ్లకి నిద్ర చెడగొట్టి, వీళ్ళపొగరు అణచాలని ఆలోచించింది. సీతను పిలిచి కొద్దిగా మట్టి తెచ్చిపెట్టమంది. ఆమట్టిమూడు రోజులు ఎండలో ఎండబెట్టింది. మట్టి తయారయాక దోమదేహాన్ని తయారుచేసింది. సన్నని గడ్డి పోచలతో కాళ్లు తయారుచేసింది. ఒక బ్రహ్మజెముడు ముల్లు తీసి తోకగా అంటించింది. సన్నటి గడ్డి పువ్వుల రేకులు తీసి రెక్కలుగా అంటించింది. కాని తీరా ప్రాణంపోసేలోపల, దేహంలో రక్తం పొయ్యటం మర్చిపోయింది. "ఇదేమిటి తల్లీ, నన్ను రక్తం లేకుండా పుట్టించావు! నేనెల్లా బ్రతుకుతాను" అని ఆమొదటిదోమ నిరంతకీని అడిగింది. "ఓ దోమా! కావాలనే నిన్నల్లా పుట్టించాను. నువ్వు రక్తపానంవల్ల బ్రతకాలి. నరుల రక్తాన్ని, పశువుల రక్తాన్ని పీల్చి బ్రతక"మని నిరంతకీదేవి చెప్పింది.

ఆ ఆదేశమే ఈనాటికీ దోమలన్నీ అక్షరాలా పాలిస్తున్నాయి.

(సండే స్టాండర్డులో, డాక్టర్ వెరియర్ ఎల్విన్ వ్యాసంనుంచి.)

---

కులాసాకబుర్లు:

# నాదభంగం

వెనకటికి సంగీతంలో నేనుగొప్పంటే నేను గొప్పని పోటీపడి, వీణలతో యుద్ధానికి దిగి ఒకళ్లతీగ లొకళ్లు తెంపుకు చక్కా పోయారట ఇద్దరు పురాణవ్యక్తులు. సంగీతంలో శాస్త్రజ్ఞులు ఒక్కొక్కరు సృష్టించే నాదాలకీ ఆఒక్కొక్కరి విశిష్టత, అంటే వాలకంలో అదొక ప్రత్యేకసొంపు, ఉంటుంది. ఎవరి వంకర టింకర్లు వారిసొంపు, వారిసొమ్ము. ఆ సొంపుని పట్టుకొని కంపు అని చెప్పి దూషించడానికి దొరకపుచ్చుకుంటారు ప్రతికక్షులు.

ఈ సొంపు తెంపుల్లో నాదం మరిగిపోకుండా ఉంటే, కల్లోలమై బీభత్సమై పోతుంది—పెళ్లి ప్రయాణప స్నాహాలలో ఉన్నపిల్లలయొద్దకి సంసారం లాగా.

ఇవాళేమిటి, ఏయుగంలోనైనాసరే రాజకీయాల పని నిత్యం నాదభంగంలాగా ఉంది. సంసారంలో నాదభంగం సంభవిస్తే ఓప్రొటతో మళ్లీ సద్దుకొంటుంది. కాని రాజకీయాల్లో అది యుద్ధంవరకూ దిగలాగేస్తుంది. పూర్వం యుద్ధకాలంలోనూ అరణ్యాలలోనూ మాత్రమే వినిపించిన నినాదాలు ఈ యుగంలో సర్వకాల సర్వావస్థల్లోనూ వినవస్తున్నాయి.

బ్రిటన్‌లో వ్యాపారంతో ప్రారంభమైన నినాదాలు ఫ్రాన్సు అమెరికాల్లో విప్లవాల్లో సింహాల్లోకి మార్క్సు ఎంగెల్సుల ధర్మమా అని అన్నిరంగాల్లోకీ దిగి గజ్జెలు కట్టాయి. ఇంక చూడండి.

ఆనాటినించీ నినాదాలు తుపాకులకంటె ఎక్కువ గురిసేర్చి, బాంబులకంటె భీషణంగా, కొటకొలూ, కలగా, పుట్టకంటె జోరుగా వ్యాపిస్తున్నాయి. రాజకీయం అంటే నినాదాల పుట్ట అని పేరు పడిపోయింది. కాబట్టి ఈనాదాల్ని తెంచడం రోత్తుకు పెరిగిపోయింది. నాదాలు నాదభంగాలతో జరిగే గోల, అల్లరి, రాజకీయాల సొంపుగా మారాయి. ఈసొంపే ఇప్పుడు రాజకీయనాయకులు అందరికీ స్టాలిన్ నుంచి కాంగ్రెసు పంచాయతీ ఓబయ్యవరకు ఇంపయింది.

ఈ ధోరణి ఈ కేకలూ, ఈగోల వినిపించకపోతే నాయకులికి నిద్రపట్టదు. అన్నం సహించదు. కొందరికి నినాదాలే అన్నపానీయాలైనాయి. కొందరికి నాదభంగమే ప్రాణాధార మయింది. ఆదెబ్బతో నినాదాలు బాజాలై పూరుకున్నాయి. అన్నట్టు, పూరుకోలేదు, ఊరంతా లోకమంతా మోతెత్తించేస్తున్నాయి. నినాదంతో పాటు నాదభంగం, జయధ్వానాలతో పాటు "డౌన్‌విత్" "ముర్దాబాద్", "ధ్వంసమవాలి", "చావాలి" అనేశాపనార్థాలు, సొంతడబ్బా వాయించుకోడంతో పాటు ఎదటివాడి డబ్బా వాయింపుని తన రణగొణధ్వనిలో ముంచేసి వాడి డబ్బా వినిపించకుండా చేసెయ్యడం—ఇవి ఇప్పుడు రంగంలో ఆటలైనాయి.

నినాదాల్లో, లేక డబ్బామోతల్లో, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం మోతెత్తినంత జోరుగా మరేవీ మోగలేదు. లోకమంతా గింగుర్లెత్తి దడదడలాడిపోతోంది. వ్యాపారమంటూ దేశాలకి దేశాల్ని దోపిడిచేసేవాళ్లు కూడా ప్రజాస్వామ్యం అంటోంటేచూస్తూ ఊరుకోలేక తమకున్నది ప్రజా ప్రజాస్వామ్యమని (పీపుల్స్ డెమోక్రసీ, ఆ ప్రమేడి) తాలంకే చెవికోసుకునే కామ్రేడ్సు అన్నారు. స్వాతంత్ర్యాలు నాలుగని ఒకరు పద్నాలుగని ఒకరూ అమెరికాలో నిర్వచనలు చేశారు. అవి ఎప్పటికప్పుడు మారుతూనే ఉన్నాయి. వ్యక్తి స్వాతంత్ర్యం, మాటస్వాతంత్ర్యం, ఆట స్వాతంత్ర్యం, ఆస్తిస్వాతంత్ర్యం, దివాలా స్వాతంత్ర్యం, వగైరా స్వాతంత్ర్యాలకోసం బ్రిటన్ అమెరికాలు ప్రాణాలొడ్డి పోరాడుతున్నాయి. అవన్నీ ఎవడికెక్కవాలి; ఉన్నాసరె లేకపోయినాసరే, తిండి స్వాతంత్ర్యం తిక్కలస్వాతంత్ర్యం ఉండాలని కామ్రేడ్సు అంటున్నారు. సరిగ్గాచూస్తే మాటలో స్వాతంత్ర్యం అని నాదం చేస్తున్నారేకాని వాళ్ల అసలు అర్థం వేరు.

ప్రజాస్వామ్యాలు యేవే స్వాతంత్ర్యాలు కావాలంటున్నారో అవి ప్రభుత్వాలు ఇవ్వాలనీ, ఇవ్వకుండా ఎవరైనా అడ్డుపడితే వాళ్లని ప్రభుత్వం చితగ్గొట్టాలనీ వాళ్ల అంతర్యం. అంటే వాళ్ల ఆస్తి పాస్తుల్ని దోపిడీ వ్యాపారాన్ని ప్రభుత్వం రక్షించాలన్న మాట. ఇంక ప్రజాప్రజాస్వామ్యాలు కావాలంటున్న స్వాతంత్ర్యం "ప్రభుత్వం వ్యక్తుల్ని చితగ్గొట్టి సమిష్టిగా పనిచేయించి అందరికీ పంచి పెట్టాలని స్ఫురిస్తుంది. ఇదికూడా నిజంగా వాళ్ళ అంతర్యమానో కాదో ఆ కామ్రేడ్స్‌కే తెలియాలి.

ఈ నినాదాల్లో, లేక బాజాల్లో, లోకానికి పిచ్చెత్తిపోయి సంగీతమేదో మోతేదో తెలియకుండా పోతోంది. "ప్రపంచాన్నంతా మింగెయ్యాలని స్టాలిన్ నోరు తెరుచుకు చూస్తున్నాడు. మాదగ్గిర తుపాకులు టాంకులు మరఫిరంగులూ కొని జాగ్రత్త పడండి" అంటున్నాడు ట్రూమన్.

"ఇదంతా వొట్టిది. మిమ్మల్ని దోచుకోడానికి మీదేశాల్లో జాతీయ బూర్జువా వర్గంలో చేరి కుట్రపన్నుతున్నారు, ట్రూమన్ బెవిన్‌లు" అంటారు కామ్రేడ్సు. మీదేశంలో నెహ్రూ ప్రభుత్వం మీ ప్రభుత్వం కాదు. బ్రిటిష్‌వాళ్ల ప్రభుత్వమే" అంటుంది కొమిన్ఫారమ్ జర్నల్. "తీరా మన 'మొవరం'" అనే పెద్ద సందేహం చాలామంది బుర్రల్ని వాయగొట్టేస్తుంది. "మాకు మీతో పనిలేదు. మీరూ మీరూ బుర్ర బద్దలు కొట్టుకుంటే కొట్టుకున్నారు. మమ్మల్ని యిరికించవద్దు" అని ఎవరైనా అంటేవాణ్ని కమ్యూనిస్టు అని ప్రజా ప్రజాస్వామ్యవాది తిడతాడు; బూర్జువా అని ప్రజా స్వామ్యవాది తిడతాడు. తిట్టడంతో విడిచిపెట్టరు. విరుచుకు మీద పడతారు.

మనదేశంలోనే చూడండి. కమ్యూనిస్టుల్ని కాంగ్రెస్‌వాళ్ళు బాజా పడుతున్నారు. కాంగ్రెసువాళ్లని కమ్యూనిస్టులు రాత్రివేళ మీదపడి కొడుతున్నారు. కాంగ్రెస్‌వాళ్ళని కాంగ్రెసువాళ్ళు తిడుతున్నారు. కళావారి వర్గాన్ని రంగాగారి వర్గం రౌడీలంటారు. రంగాగారి వర్గాన్ని కళావారి వర్గం రాంగోయులు రంగాళ్ళోర్లు అంటున్నారు. వీళ్లైనప్పటిలా ఒకళ్లనొకళ్లు నిప్పు కమ్యూనిస్టు అంటే నిప్పుకమ్యూనిస్టు అనితిట్టుకుంటున్నారు. అందర్నీ కలిపి తిండి దొంగలు, దొంగవ్యాపారులు, వ్యాపార దోపిడిగాళ్లు, ప్రజాపిప్పిగాళ్లు వగైరా పేర్లతో తిడుతున్నారు.

చివరికి నాదం నినాదమై తరవాత భంగమై ఆఖరైన ప్రజాస్వామ్యమైలోకాన్ని బాజా పట్టేస్తోంది. (కులాసన్)



ఐక్యరాజ్యసమితివారి భారతీయ విద్యార్థి సంఘసమావేశాన్ని ప్రధాని నెహ్రూ ప్రారంభించారు శ్రీ కె. యం. మున్షీ అధ్యక్షత వహించారు.



చారణీ ఉద్యాన శిశుకేంద్రానికి సర్దార్ పటేల్ శంకుస్థాపన చేశారు.



లండన్
అమెరికా



మంత్రివర్గంనుంచి విరమించుకున్న, జయరాందాస్ దౌలత్ రామ్, జాన్ మత్తయ్‌లకు ఢిల్లీ పౌరులు వీడ్కోలు ఇచ్చారు.



ట్లాంటిక్ కౌన్సిల్ సమావేశానికి హాజరైన విదేశాంగ మంత్రి ఎచిసన్; సలహాదారు జాన్ హెర్‌మన్ కూపర్.



భరత ప్రభుత్వ న్యాయశాఖామంత్రి డాక్టర్ భీమారావ్ రామ్‌జీ అంబేద్కర్ సతీసమేతంగా ఈవారం చెన్నపట్నంమీదుగా సింహళం వెళ్లారు.

సాహిత్యమీమాంస:

# స్వర్గములో ధర్మరాజు

శ్రీ పెనుమర్తి కామేశ్వరరావు

పంచమవేద మని ప్రసిద్ధిగాంచిన భారతమునందు ధర్మరాజుపాత్ర అతి పవిత్రమైనది. అత డజాతశత్రుడని, అనసూయాపరుడని, అక్రోధనుడని, అకల్మషచిత్తుడని, శాంతుడని, దాంతుడని కీర్తి వహించెను. ఆత డేపట్టున నెవ్వరిని నిందావాక్యములాడక సర్వము దేవుని మాయాఖేలన మని సంతృప్తిచెందిన నిష్కామయోగి. అతనికి కష్టసుఖములు సమానములు. అతడు ధర్మమార్గానువర్తనములో అచంచలనిష్ఠ గల ధీరుడు.

ఉద్యోగపర్వములో శ్రీకృష్ణుడు అనినాడు :

ధర్మమార్గంబు దప్పక తలపుడొక్క—
తెఱగు ధర్మువు దప్పియుధిష్ఠిరుండు
బడయ నొల్లడు దయ్యింద్రపదవియైన
నుచితగతి నెంతః డబ్బినయుల్లసిల్లు.

పరమాత్ముడగు శ్రీకృష్ణుడు ధర్మరాజు యొక్క ఉదాత్తాశయము నటుల గీర్తించినాడు. నిజముగా ధర్మరాజు అన్వర్థనామధేయుడు.

ఉద్యోగపర్వమున సంజయుడు ధృతరాష్ట్రునితో ధర్మరాజును గూర్చి చెప్పిన మాటలవలన ధర్మరాజుకీర్తి తేటతెల్లమగుచున్నది.

దేవరపంపగా జనియు
ధిష్ఠిరు నిం గనివచ్చినాడ
నాభూమివిభు డప్రమేణయ
పూజ్యుడు మీకు నమస్కరించె సం
భావనసేసె నాకిచటి
బంధులనెల్ల దలంచె మీ సుఖ
శ్రీవిభవంబులున్ సుతుల
సేమము నన్నడిగెం బ్రసన్నుడై.

ధర్మజునకు భోగంబులు,
ధర్మవున ట్లింపుగావు ధర్మంబులలో
నిర్మలబుద్ధి వహింపకుం
గూర్మిగడుగల డతండు కురువంశనిధీ.
మనసుశక్తి యెల్లడు ప
మంచిత దైవమయాదియుండు...

ధర్మరాజు ఆదర్శవంతుడు. మహాత్ముడు. అతని సద్గుణములు భారతీయ సంస్కృతిని నిరూపించుచున్నవి. దుష్టచతుష్టయములో నొకడైన రాధేయుడు గూడ ధర్మజుని గీర్తించినాడు. శ్రీకృష్ణు డుద్యోగపర్వమున కర్ణునితో—

నీవు వృద్ధజనోపసేవి విశారదుం
వేదవి తెలియంగవినుముసిద్ధ
మంత్రబలంబున మార్తాండువరమున
గన్నియతఱి గొంతి గన్నవాడ
వగుట బాండు నృపాలు నగ్రసుతుండవు
ధర్మమార్గంబిది ధర్మతనయు
డాదిగాగల తమ్ము లందఱు నాచేత
నెఱిగి నీయడుగుల కెఱగి సకల
పుత్త్రమిత్త్రబంధుభూరిసేనాసమ
న్వితముగాగ గొలిచి నిన్ను రాజ్య
భారవహనమునకు బట్టంబుగట్ట
నజ్ఞులుడ వగు గమ్మ వారికడకు.

అని చెప్పగా విని కర్ణుడీవిధముగా ప్రత్యుత్తరం బిచ్చినాడు.

ధర్మతనయుండు తాను నాతమ్ముడగుట
యెఱిగె నేనియు సామ్రాజ్యమే పూను
నట్టి ధార్మికు డాధిపత్యంబుసేయ
గలవడే శాశ్వతంబుగ వసుధకెల్ల.

శ్రీకృష్ణునితో నిట్లు నుడివిన రాధేయుడే కర్ణపర్వమున పటుబాణంబుల ధర్మరాజుని నొప్పించి ఏమనినాడో చూడుడు!

క్షత్త్రియకులమున జన్మించి యిది ధర్మ
మిది యధర్మం బని యెల్ల నెఱిగి
నట్టి [illegible] మహాహవమున



వివిధరంగాలలో ఆరితేరినందుకుగాను 1950 సంవత్సరానికి బహుమతుల పొందిన అమెరికన్ స్త్రీలు

ములు డాచికొన శాత్రవులకు దొలగి
పోవుట దగునె నీ బుద్ధిగానగనయ్యె
నృపనీతియెఱుగవు నీవు బ్రాహ్మ
ణాచార వేదివి యాగాధ్యయనముల
వర్తింపకనియ్యంబు వలవదు మగు
మింక నను బోటి దొడరిన నింతకంటె
నెడరువాటిల్లు వేగ పొమ్మింటికడకు
హరియు బార్థుడు నున్నెడకైన నరుగు
మేను దగనీకు ప్రాణాన కింత నిజము.

కర్ణుం డింత పరుషముగ ధర్మజుని నిందించినాడు. కాని కర్ణుని పలుకులలో యదార్థములేకపోలేదు. ధర్మరాజహింసావాది. రణకౌశలము గలవాడు కాడనునది నిస్సందేహము. ధర్మరాజుని 'నీవు బ్రాహ్మణాచారవేదివి యాగాధ్యయనముల వర్తింపు' అని కర్ణుడు పలికెను. కర్ణునిమాటలలో నవహేళన యున్నది కాని నిజముగ ధర్మరాజు పాత్రౌచిత్యమున కా మాటలు దోహదమొసగునవిగా గాన్పించుచున్నవి.

శాంతిపర్వమున ధర్మరాజు కర్ణుడు తనకు జ్యేష్ఠుడని యెఱింగి పలవించుట చూచిన ఆమహాత్మునకు కర్ణుని దుశ్చేష్టితములపై నేవగింపు కానరాదు. అది మహనీయుల స్వభావము. కర్ణుని వృత్తాంతమును తల్లి వలన విని ధర్మరాజు శాంతిపర్వమున నిట్లు దుఃఖించినాడు.

ఘనభుజవిక్రమోన్నతుడు
గౌరవకోటికి బట్టుగొమ్మయ
య్యనిమొన దూలపుచ్చిన మ
హాత్ముడు గర్ణుడు — అనిపాపము!
గాండివి నొవ్వ బల్కుటెఱు
గర్ణుని జంపక వచ్చితేని ద
మ్ముండవు గావు నాకు నని
మూర్ఖత సోదరఘాతినైన క
ష్టుండ, మనంబునం దలుగు
శోకము నెట్లు సహింతు, దప్పె నా
తండును నేమునైన విబు
ధప్రకరంబును మాకు నడ్డమే!

దుర్యోధనునకు కుడిభుజముగా నుండి మొదటినుండి పాండవుల నెన్నో బాధలకు గురిచేసిన కర్ణునిపై ధర్మజున కింతయును రాగమో ఏల్లడైనది.

## ౨

మానవుడుగా నున్న ధర్మరాజొక్క సమయమున గూడ నన్యుని పరుషవచనము లాడలేదు. అతడు సంపూర్ణముగ ధర్మావతారముగా భాసించినాడు. అసూయా పరుడుగా వెలింగినాడు. ఆ ధర్మరాజే శరీరముతో స్వర్గములో ప్రవేశించినాడు. ఇటువంటి ప్రత్యేకత నంతకుముందే రాజులు నందుకొనలేదు.

మహాప్రస్థానిక పర్వమున పాంచాలి నడచి వచ్చుచు మేదిని బడి ప్రాణములు విడువగా ధర్మరాజు వికలమనస్కుడు గాలేదు. 'ధైర్యస్థైర్యంబున విక్రుతిలేని గతి నావనిత శవము విడిచి కౌరవవిభుం డేగెన్!' తరువాత సహదేవుడు, నకులుడు, అర్జునుడు, భీముడు వరుసన మృతులైరి కాని ధర్మరాజు చలించలేదు.

ధర్మరాజు స్వర్గమున ప్రవేశించి తన సోదరులను, పాంచాలిని చూడ వాంఛించినాడు. వారందఱు స్వర్గమున సౌఖ్యముగ నుండియుందురని ధర్మరాజు తలంచినాడు. కాని అతనికి స్వర్గమున మొట్టమొదట దుర్యోధనుడు కన్పించినాడు. అఖండులందు —

తనువాని రావించి ధర్మనందనునకు
దనువారి జూపి చిత్తమున గోర్కి
దనికిన యది నీవితలిక్షితినటు గొనిపోయి,
యఖిలబంధువుల జూపు మనుమనతడు
గారవం బెసగంగ నారాజసత్తము
దోడ్కొని పోవ సురపాలమున
దోపన నారదాదులు గొందఱిరిగిర
ట్లొగగుచోట గట్టెదుర దోచె
నున్నతాసనాసీను డభ్యుదితిసరసి
జాప్తసంకాశు డమృతాశనాంగనాది
వృతుడు వీరలక్ష్మీవిరాజితుడు సతత
యుక్తసుఖసాధనుండు దుర్యోధనుండు.

అట్లు స్వర్గమున నున్న దుర్యోధనుని గాంచిన వెంటనే అజాతశత్రుని మనసు కలత నొందినది. అతని కసూయ, క్రోధము జనించినవి. శరీరముతో స్వర్గమున కరుదెంచుటవలన ధర్మరాజునకు మర్త్యవాసనలు వాయలేదు. యుద్ధమున మృతుడైన వీరవరుడు దుర్యోధనుడు స్వర్గము నలంకరించుట అతనికి దుస్సహమైనది. సుయోధనుడు అతిపాపకర్ముడు. అట్టివానికి స్వర్గావాసము నొసంగుటవలన ఇంద్రునకు న్యాయాన్యాయములు తెలియవని, ధర్మరాజునకు సందేహము కలిగినది.

సుయోధనునిగూర్చి ధర్మరాజేమని నాడో చూడుడు:

ఇతడతిలోభోపహతమానసుడు
దీర్ఘదర్శిగాడితని కతమునజేసి
నిఖిలదేశంబుల యఖిలన్నపాలురు
తురంగగిరి దంతి తురంగసహిత
ముగ, ననవద్యాంగి, విగతకల్మష ధర్మ
చారిణి, సాధ్వి, పాంచాలి నార్య

జనములు గనుగొన సభలోన నవమాన
పెట్టిన తులువ, యే నిట్టివాని
తోడ గలసి మెలగుదునె మహితాత్మకు
లార ! యెచటనున్నవారు భీమ
ఫల్గునులును గవలు పాంచాలియును
నన్ను నచటికి గనుపవలయు నను మురలె.
...పాపశాలిస
జ్జనసతతాపచారికుల
సంక్షయకారణరోషభాగి యి
మ్మనుజవరాధముం డిత
డమర్త్యులకెల్లను మాననీయుడై
మనునె పుణ్యలోకమున?'

అని ధర్మజుడు దుర్యోధనుని చూచి అసూయాగ్రస్తుడైనాడు. నరకమున నున్న యన్నదమ్ములగని ధర్మరాజు శోకావిలుడైనాడు.

ఒకటను మేఘసేనుని సు
యోధను డెమ్మెయి దేవపూజ్యుడై
సకల సుఖానుభూతియున
జస్రము పెంపుగహింప నొప్పి దృ
ష్టికి గడు వ్రేకనై తనదు
చెల్వలు, జుట్టలు దాను సంతసం
బు కలిమి నేచి మిన్నడిచి
పుణ్యపదావృతుడై వెలింగెడున్.

తన సోదరుల నుద్దేశించి ధర్మరాజు.

ఈగకొలి యంతియేనియు బాపంబు
వీరివలన గనుట వినుట గలుగ
దొక్కనాడు నట్టి యుత్తములకు విధి
పాడిమాలి యిట్టి పాటు దెచ్చె.
నా యనుజులు దుఃఖార్దితులై
యున్నారట్టులగుట నచటికే రానిం
కీయెడన యేను నిలిచెద
బాయక యని చెప్పుమా కృపానిరత నకున్.
అని దేవదూతతో ననినాడు.

తన సోదరుల దుస్థితికి వగచుచున్న ధర్మజునికడకు యమధర్మరాజరుదెంచి 'సూర్యతనయ పవననందనాదుల నరక దుఃఖానుభావంబులు మా చేసిన వెడమాయంబులగుట నీకు దెలిసెనని చెప్పి ఆతని తేర్చినాడు.

అనంతరము ధర్మజుడు ఆకాశగంగా స్నానం జొనరించి—

'మానుష తనువు నమ్మాత్రన విడిచి
దివ్యంబగు మహితదేహంబు దాల్చి
వైరమాత్సర స్నేహసంవాసకాల్య
గర్వశోకాదులైన హృద్గత వికార
ముల దొలంగి నిర్మలత్వమున వెలుంగు
పావకుడు బోలె శోభిల్లె'

ఇట్లు స్వర్గమున ధర్మరాజు దుఃఖమున నసూయాగ్రస్తుడగుటకు కారణము.

'అల్పపుణ్యుడు తొలితొలి యమరతాసుఖంబు గలుగొని మఱియు దుఃఖములనొందు భూరిపుణ్యుండు మును ఘోరనిరయయాతనలనొంది పెండి సౌఖ్యంబు లొందు.'

ధర్మరాజు భూరి పుణ్యుడు. అల్పపుణ్యుడు సుయోధనుడు. అందుచే సుయోధనుడు కలిలో కలిసినాడు. ఆతని తమ్ములు రాక్షసులలో గలిసినారు.

మహాప్రస్థానమున పాంచాలియు, ననుజులును మరణించినపుడు వికలత్వమొందని ధర్మరాజు స్వర్గమున సోదరులను గానక విచారము నొందుట, సుయోధనుని గని అసూయపడుట – ఇవి రెండును ధర్మజుని మనసు పరీక్షించుటకు యముడు పన్నిన విషయము. యముడు ధర్మరాజుతో నిట్లని నాడు: 'నిస్సీమ గౌరవ! పరీక్షింప గంటి నిన్ను మున్నారణి ప్రసంగంబున, ద్వైతవనంబున, దగిలి కుక్కతో వచ్చినప్పుడు, దైవతగిరి పొంత ననుజవర్గము విషయంబుగా గని నివ్వడిచటను జలన మొకప్పుడైన నీదు మది నించుకేనియు లేదు. దమము, శమము, సత్యంబు, మద్గత సారభక్తి నీకు నగ్గలములు మహనీయచరిత !'

ధర్మరాజు, కర్ణుడు తన యన్నయని ఆతడు మృతినొందిన పిమ్మట కుంతీదేవివలన విని, అప్పటినుండి ఆతనియెడ తన మదిలో నధిక గౌరవమును వహించినాడు. స్వర్గములో ధర్మరాజు సుయోధనుని చూచి అసూయాగ్రస్తుడైనాడు గాని కర్ణుని జూడ నమితోత్సాహము ప్రకటించినాడు.

అతని నెఱుంగకుండి విను
మర్జును బంచితి నమ్మహాత్మునిన్
మృతుడుగ జేయగా నదిశ
మింపదు శోకము నావహించుచున్
మతికి నలంత సేయు గుణ
మాన్యుని నాతని జూచు కౌతుకం
బతిశయ మొందుచున్నయది
యాయన యెచ్చటనుండు జెప్పరే.
అని దేవదూత నడిగినాడు.

భారతమున ధర్మరాజు సమగ్రమైన శాంత స్వభావుడు. యముడు, ఇంద్రుడు ఆతని బరీక్షించుటకే మొట్టమొదట ఆతనికి స్వర్గమున సుఖమనుభవించుచున్న దుర్యోధనుని జూపినారు. ధర్మరాజుపాత్రలో తిక్కన పదియేడు పర్వముల గానుపింపని ఈసు, రోషము స్వర్గారోహణపర్వమున గానుపించుచున్నది. చక్కని తెలుగుదనమున తిక్కన సోమయాజిగారు అసమానులు. ఆయన భారతపాత్రలు నాటకరంగమున నటించుచున్న నటకులవలె భారతము జదువుచున్నపుడు మన కనుల కట్టెదుర గాన్పించుచుందురు. తిక్కనగారు కళాజగతీ చతుర్ముఖులు. ఆయనకవితామృతపానము సర్వపాపహరము.

———



బ్రిటిష్ ఫ్రెంచి సైన్యాల మధ్యజరిగిన రగ్బీ టోర్నమెంటు.



# బాలానందం

## ప్రఖ్యాతచిత్రకారుడైన గొఱ్ఱెలకాపరి "గయొట్టొ"

గొఱ్ఱెలకాపరివాని బొమ్మలు ఇటలీలో చాల ప్రసిద్ధి గాంచినాయి. పూర్వము మహాసామ్రాజ్య మని, రోముసామ్రాజ్య మని ప్రసిద్ధి గాంచిందే ఆ రోమునగరమే ఈఇటలీకి ముఖ్యపట్టణం. రోముసామ్రాజ్యంలో శిల్పులేమి, గాయకులేమి, మహారాజ్యాలేమి ఎన్నో వెలసినవి, అస్తమించినవి. రోముకు సంబంధించిన అన్ని విషయాలూ వింతలే. ఆ వింతలలో మరీవింత ఈ గొఱ్ఱెలకాపరి బొమ్మలు.

వీని బొమ్మలు ఆరువందల సంవత్సరాల క్రిందటి మాట: అప్పుడు ప్రతి చిత్రకారుని బొమ్మలు క్రైస్తవుల దేవాలయాలగు చర్చిగోడలమైనా ఇళ్ళపైనా చిత్రించబడియుండేవి. ఈ బొమ్మలు చిన్ని రంగులరాళ్ళతో సమర్చబడియుండేవికూడ. వీటన్నిటినీ "మొజాయిక్స్" అని పిలిచేవారు. ఈచిత్రములు మార్దవంగా లేక

**శ్రీమతి నందివాడ కళ్యాణిదేవి**

కఠినంగానిర్జీవంగా వున్నట్లు కాన్పించేవి. కుంచెలతో గీచిన బొమ్మలుగూడ కొయ్యబొమ్మలులాగే కన్పడేవి.

ఈ స్థితిని తొలగించి వాటిలో రమణీయతను సాధించ నాలోచించినవాడు "గయొట్టొ" అను ఇటలీవాస్తవ్యుడు. ఈతడు ఇటలీలోని అందమైన ఫ్లారెన్సుపట్టణములో చిన్నప్పుడు బడికి పోక తన తండ్రియొక్క గొఱ్ఱెలను కాపాడుతూ వుండేవాడు. ఈపని ఇతనికి నిజంగా రుచించలేదు. ఆ కాపలా కాస్తున్నప్పుడు ప్రొద్దు పుచ్చుటకు ఆబీదులలో బొమ్మలు గీస్తూ కాలము గడిపేవాడు. కాని అతనికి అప్పుడు పెన్సిలుగాని కాగితము గాని లేవు. అందుచేత మొనగలిగిన రాళ్ళతో చదును రాతి మీదగాని పలక మీదగాని బొమ్మలు గీసేవాడు. అప్పట్లో బొమ్మలకై అత



కి స్ఫురించిన ఆకారాలు తనతండ్రి గొఱ్ఱెల రూపములే. వాటిని జాగ్రత్తగా పరిశీలించి ఆబొమ్మలే గొఱ్ఱెలనేటంత నేర్పుతో చిత్రించడము అలవాటు చేసికొన్నాడు.

ఇట్లా గొఱ్ఱెల రక్షణకై పోయి బొమ్మలు గీస్తున్న సమయంలో ఒక మహనీయుడు ఈతనిని చూచుట తటస్థించింది. ఈవచ్చిన వ్యక్తి ఒక చిత్రకారుడు. అందుకని 'గయొట్టా' బొమ్మలు ఆయనను ఆకర్షించాయి. 'గయొట్టా' బొమ్మలలోని జీవమును చూసి ఆశ్చర్యపడినాడు. అంతకుముందు ఆదేశంలోని చిత్రాలన్నీ జీవంలేనివని ముందే చెప్పానుగదూ! ఈ విశిష్టతను చూసి గయొట్టాతండ్రిని వర్శించి, గయొట్టాను తన శిష్యునిగా తీసికొంటా నన్నాడు. దేనికైనా వేళావిశేష ముండాలి. ఏధ్యాసలో యున్నాడో తండ్రి వెంటనే 'గయొట్టా'ను ఆవ్యక్తి వెంట పంపించినాడు. అప్పటినుంచి గయొట్టా చిత్రములను గీయుటలో శిక్షణను పొందినాడు. వీటిలోని క్రమవ్యవస్థ పూర్తిగా నేర్చుకొనుటకు తరుణము లభించింది. గయొట్టా ప్రఖ్యాతికూడ వ్యాప్తి నొందింది.

గయొట్టా తొలిచిత్రము సైంటు ఫ్రాన్సిసునివాసమైన అసిసీలోని ఒకచర్చిగోడల నలంకరించింది. ఆ రోజులలో చిత్రకారులు బొమ్మలకు కాన్వాసునుగూడ నుపయోగించేవారు కాదు. నట్టిగోడల పైన, ఇంటికప్పులమీద చిత్రించేవారు. అవన్నీ దమ్మెక్కి చాల ఇటాలియనుచిత్రములను ధ్వంసము చేసినవి. కాని గయొట్టా బొమ్మలు చర్చికప్పుమీద చిత్రించినవి ఇప్పటికీఇప్పుడు గీసినట్లుగానే ఉన్నాయి. ఆబొమ్మలలో ఇప్పటికి జీవకళ యుట్టిపడుతూ, ఇతర ఇటాలియను చిత్రములకు ఈ మహనీయుని చిత్రములకు భేదము స్పష్టముగా గోచరింపజేస్తున్నాయి.

తన ముప్పదవయేట, గయొట్టా క్రీస్తుదేవుడు, సైంటుపీటరును సముద్రపు అలలనుండి రక్షించునట్లు ఒక 'మొజాయిక్కు'ను గీసినాడు. ఇది గీచినందులకై ఈయనకు విశేషమైన ధనము బహుమతిగా నీయబడినది. ఈ మొజాయిక్కు ఇప్పటికిని సైంటు పీటరుచర్చిలో చూడవచ్చును. ఆ చర్చిలోని ఈతని మరో చిత్రము క్రీస్తుదేవుని చుట్టూ పర్యవేక్షించి యున్న దేవతలను చూడగలము.

ఈచిత్రకారుని గూర్చి ఒక చిన్నకథగూడ చెబుతారు: పోపు (క్రైస్తవమతాధికారి) మంచి బొమ్మలకై గయొట్టాకు కబురంపినాడుట. తననేర్పుకు సూచనగా, ఒకకుంచతో నిర్లక్ష్యముగా ఒక సున్నాను గయొట్టా గీచి పంపినాడుట. ఆసున్నాయే పోపును ఆశ్చర్యపరవశుణ్ణి గావించింది. వెంటనే కొన్నిచిత్రములను గీయ గయొట్టాను నియమించినాడు. కాని దురదృష్టవశమున పోపుమరణము, ఆపని సమాప్తముకాకుండుట జరిగినది.

పాడువాపట్టణములోని చర్చి అంతటను ఈయన బొమ్మలు అలంకరించినవి. ఇట్లు చిత్రించుటకు నియమించిన ధూతడు గొప్ప

# రత్నాల వుంగరం

శ్రీ పి. ఆర్. మోహన్

రామయ్య తన ముగ్గురు కుమార్లకు ఉన్న ఆస్తియంతా సమంగా పంచియిచ్చాడు. వాని విలువైన రత్నాలఉంగరం ఒకటి మాత్రం ఎవ్వరికీ యివ్వకుండా అట్టిపెట్టేశాడు. అది ఎలా సమంగా ఇవ్వవలసిందీ తెలియక ఒకరోజు ముగ్గురుకొడుకుల్ని పిలిచి "మీలో ఎవరైతే ఒక గొప్ప ఘనకార్యాన్ని చేసి వస్తారో, వాడికి యీ ఉంగరము బహుమతిగా ఇవ్వబడుతుంది" అని చెప్పాడు.

డబ్బంటే ఎవడికి ఆశ వుండదు! ముగ్గురూ బయలుదేరారు తలో దేశానికి పది రోజులు తిరక్కముందే ముగ్గురూ గృహోన్ముఖులైనారు.

'ఏంరా! ఏమేమి పనులు చేసి వచ్చారు!' అని ముగ్గురు కొడుకుల వంకా చూస్తూ ప్రశ్నించాడు రామయ్య.

ముందు పెద్దకొడుకు ప్రారంభించాడు తను చేసిన ఘనకార్య వర్ణన:

"ఒక పెద్దమనిషి ఒకరోజు నావద్దకు వచ్చి 'కొంత డబ్బును నీదగ్గర కొన్నిరోజులవరకు దాచి పెట్టవలసింది. మరల నేను వచ్చి తీసుకుపోతాను' అని చెప్పి వెళ్ళిపోయాడు. మరల వచ్చినపిమ్మట డబ్బును అడిగాడు. నేను లేదూపో అంటు మాట్లాడకుండా వెళ్ళిపోయే వాడే. కాని నేను అలా అనదలచుకో లేదు. దాచిన సొమ్మును పైసాలతో సహా యిచ్చేశాను- ఏమాత్రం కాజేయకుండా" అని సగర్వంగా తనకే రత్నాలఉంగరం చెందునని వర్ణించాడు తనఘనకార్యాన్ని.

"అందరూ సామాన్యంగా నిర్వహించే పనే చేశావు. ఇందులో గొప్పేమీ లేదంటూ రామయ్య రెండోవాడివంక చూశాడు.

రెండోవాడు ప్రారంభించాడు: "ఒకరోజు నొక నదీప్రవాహంలో ఒక శిసువు కొట్టుకు పోయేటట్టున్నాడు. అమాయికప్రాణం బలి అయిపోతుందని వెంటనే ఒకపరుగున నదిలో దూకి ఆ పాపాయిని రక్షించి తల్లికి ఒప్పజెప్పాను."

"ఓ! బాగానే వుంది. కాని యింతకన్నా గొప్ప ఘనకార్యం చేసి ఉండవలిసింది" అన్నాడు రామయ్య.

ఆఖరివాడు వచ్చాడు:

"వాడు నా బద్ధవిరోధి. మేకలను కాస్తూ కొండమీద ఒకరాతిమీద చతికిలబడి నిద్రపోయినాడు. ఒక పాము బుసలుకొటుతూ వచ్చింది. నేను లేకపోయినట్లయితే వాడ్ని చంపేసి ఉండేది. వాడు నా కెంత విరోధియైనా ఆసమయంలో వాడి ప్రాణరక్షణ నావిధి అనుకున్నాను. కఱ్ఱతో ఒక్కవేటు వేసి పాముని చంపి వాడ్ని మేల్కొలిపాను." అంటుండగానే రామయ్య సంతోషంతో 'భలే భలే!' అంటూ అరిచాడు.

"నీవిరోధిని రక్షించావు. అపకారికి నుపకారము చేసిన నీవు ధన్యుడవు. నీదే అందరికన్న ఘనకార్యము. నీకే యిచ్చేస్తున్నా నా బహుమతిని" అంటూ కొడుకుని కౌగలించుకొని, ఆతని చిటికినవ్రేలికి తన విలువైన రత్నాలఉంగరాన్ని తగిలించి సంతోషించాడు రామయ్య.

[ఇంగ్లీషుపద్యము చదివినపిమ్మట.]

---

ధనికుడు. తనతండ్రిపాపములు కడగివేయుటకై ఇట్లు చర్చికి అలంకరణము చేయించినాడు. దానితో మన గొఱ్ఱెలకాపరి చిత్రకారుడే కాక ధనికుడుగా గూడ రూపొందినాడు. ఫ్లారెన్సులో తన తండ్రి యిచ్చిన భూములకు ఇంకను భూములను చేర్చి చివరకాలములో అక్కడ నివసించుటకు వెళ్ళగా ఫ్లారెన్సువాస్తవ్యులు ఈయనను ఎంతో గౌరవించారు.

విద్యయా లేదు. చేసినదా గొఱ్ఱెలకాపరిఉద్యోగము. కాని ఆ జీవితమే, ఆ గొఱ్ఱెలే ఈయనను ఇంతవానిగా చేసినవి. ఈయన జీవితము మన పురాణములోని ఏకలవ్యుని జ్ఞప్తికి తెస్తుంది.

---

బాలానందం :



# ధైర్యశాలి



మూలం: ఓర్నైబుల్ కథ      అనుకరణం: శ్రీ కిశోర్ బాబు

అనగనగా ఈజిప్టు అనే దేశాన్ని ఒక రాజు పరిపాలిస్తూండేవాడు. అతని కున్నంత ధనం, బంగారం ఆకాలంలో ప్రపంచంలో ఎవరికీ ఉండేది కాదు.

ఆ రాజుకి ఆ డబ్బంతా ఎల్లా దాచాలా అని విచారం పట్టుగుంది. చివరకు ఎల్లాగయితేనేం అతడు ఒక పెద్దరాతితో చేయబడిన గది సంపాదించాడు. తన రాజభవనం ప్రక్కనే ఆ కట్టు కట్టించాడు. దానిలో పెద్దపెద్దరాతితొట్లలో తన ధనాన్ని పోశాడు. దానికి జాగ్రత్తగా తాళంవేయించి గేటుదగ్గర కాపలా ఉంచాడు.




కాని ఆ గదికట్టిన శిల్పిమాత్రం తక్కువవాడా! దురాశతో ఆ కట్టు గోడ కుండే రాళ్ళలో ఒక రాతిని గమ్మత్తుగా అతికాడు. ఒక రిద్దరు మనుష్యులు (కొంచెం బలమైన వాడైతే ఒకడుడైనా చాలు) దాన్ని తీసివేయగలరు. మళ్ళీ దాన్ని యథాస్థానంలో పెడితే అన్నీ రాళ్ల లాగే ఉంటుంది. ఈ సంగతి రాజుకు కూడా తెలియదు.

దురాశ దుఃఖముచే టని ఊరికే అన్నారా పెద్దలు. ఆ ముసలి శిల్పి ధన మేమీ తీయకుండానే మంచ మెక్కాడు. తా నింక ఎల్లాగా బ్రతక నని తెలుసుకొని తన కొడుకుల నిద్దరిని రహస్యంగా పిలిచి ఈకథంతా చెప్పాడు. కొడుకు లిద్దరూ ధైర్యశాలులూ తెలివైన వాళ్ళూను. తరువాత కొద్దిరోజులకా శిల్పి చనిపోయాడు.

మనవాళ్లిద్దరూ అట్టే ఆలస్యం చెయ్యకుండా ఒక మంచిరోజు చూసుకొని బయలుదేరారు. రాయిని తీశారు. ఒకడు ఆకన్నంగుండా లోపలికి దూరి తా మిద్దరు మోయగలిగినంత ధనాన్ని తీసుకుని బయటవాడి కందించాడు. రాయిని మళ్ళీ ఎప్పటిలాగే పెట్టేసి ఇంటి కెళ్ళిపోయారు.

రాజుగారికి రోజూ తమ ధనాగారాన్ని పరీక్షించడం అలవాటు. మరునాడు మామూలుగా వచ్చి చూసేటప్పటికి ఆశ్చర్యపోయాడు. తాను స్వయంగా దగ్గిరవుండి తొట్టెలనిండుగా డబ్బు పోయించాడు. కాని ఇప్పుడు కొన్నితొట్లు వెలితిగా ఉన్నాయి.

తాళం తాళంలాగే ఉంది. మరి డబ్బు ఎల్లా పోయినట్లు? లోపలికి దొంగ ఎల్లా ప్రవేశించినట్లు? రాజుకి ఏం చెయ్యాలో తోచింది కాదు. ఇల్లాగా దొంగలు మూడు నాలుగుసార్లు డబ్బు పట్టుకుపోవడంతోటే రాజుగారికి పిచ్చెత్తినట్లయింది. పైకి కనుపించకుండా వుండేటట్లు దాంట్లో బోనుల్లాంటివి అమర్చాడు. దొంగ దాంట్లో చేతులు పెట్టగానే అవి చేతులను గట్టిగా పట్టుకొంటాయి. అవి వదలించుకోటానికి బ్రహ్మకూడా శక్యంకాదు.

మళ్ళీమాటు మామూలుగా ఇద్దరు సోదరులూ వెళ్ళారు. పెద్దవాడు లోపలికి దూరాడు. దగ్గిరగా ఉన్న ఒకతొట్టెలో చేతులుంచాడు. ఇంకేముంది! అతని చేతులు బోనులో ఇరుక్కున్నాయి.

దొంగకి ముచ్చెమటలు పోసాయి. దాన్నుండి తాను ఎల్లాగా వదలించుకోలేనని తెలుసును. ప్రొద్దున్నే రాజు వచ్చి చూస్తాడు. తనకి ఒక్కడికే కాకుండా తన వంశానికంతకీ ఉరిశిక్ష పడుతుంది. ఎంత ఘోరం!

తమ్ముడిని శాంతంగా పిలిచాడు. సంగతంతా చెప్పాడు, దానికి ఒక్కటే ఉపాయం-ఉంది తమ్ముడు తనతల నరికేసికనక పట్టుకుపోతే రే నెవరూ తన్ను గుర్తుపట్టలేరు. ఎంతయినైనా సోదరుడి తల నరికెయ్యగలడా! కాని అంతకంటే మార్గం లేదు. తమ్ముడు తన అన్నగారితల నరికేసి తనకండువా చుట్టి ఇంటికి తీసుకుపోయాడు.

మరునాడు రాజుగారు బోనుల్లో ఒక తలలేని మొండెం ఉండటం చూశాడు. అతని ఆశ్చర్యానికి అంతు లేకపోయింది. ఈకథనంతనీ నడుపుతున్నవాడింకోడున్నాడని అనుకున్నాడు.

వాడిని పట్టడం ఎలాగ! ఆ మొండాన్ని కోటగుమ్మందగ్గర వేలాడదీయించాడు. ఆపక్కనించికనక ఎవరైనా ఏడుస్తూ వెడుతున్నట్లయితే వాడిని వెంటనే తనదగ్గరికి తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు.

దొంగ ఇంటికి వెళ్ళగానే ఈసంగతి అతని తల్లికి తెలిసింది. దొంగ తప్పులు తనవి కావని ఎంత మొత్తుకున్నా తన పెద్దకొడుకు మొండెం కావాలని మూర్ఖం పట్టుకొనికూచుంది మొండాన్ని తీసుకురాకపోయినట్లయితే తానే స్వయంగా రాజుగారితో సంగతంతా చెప్పుతానని భయపెట్టింది.

ఇప్పుడు దొంగకి చావొచ్చి పడింది. అక్కడున్న రాజభటులనందరిని మోసగించడం ఎల్లాగు. చివరకు ఒక ఉపాయం తట్టింది.

బజారు కెళ్ళి కొన్ని గాడిదలను అద్దెకి తీసుకున్నాడు. వాటిమీద సారాపీపాలను వేసుకొని వర్తకుడి వేషంతో చీకటిపడేటప్పటికి కోట గుమ్మందగ్గర హాజరయ్యాడు. తన అన్నగారిశవం అక్కడే ఉంది. అక్కడ చాలామంది కాపలా కాస్తున్నారు. మన దొంగ 2, 3 పీపాల మూతులు వదులుచేశాడు. దానితో ఆమూత లూడిపోయి సారాఅంతా క్రిందకి ఒలికి పోడం మొదలెట్టింది. బోలెడంత మంచి సారాయి క్రింద ఒలికిపోవడం ఎలా వాళ్లు చూశారు. ముందర దీనికి మూత సరిగ్గా పెట్టాలో తెలియక వర్తకుడు గోలెత్తుకున్నాడు.

వెంటనే రాజభటులు తమదగ్గిర ఉన్న పానపాత్రలతో పరుగెత్తుకొచ్చి తాగినంత తాగేశారు. ఇది చూచి దొంగ కోపంవచ్చినట్లు నటించి వాళ్ళను తిట్టిపోశాడు. వాళ్లు తాము తాగకపోయినా అది నేలపా లయ్యేదే నని వాళ్లు వర్తకుడిని ఊరడించారు.

కొంతసేపటికి వర్తకుడు వాళ్లతో వేళాకోళాలు మొదలెట్టాడు. వాళ్ళకి ఒక నిండుపీపా బహుమతి చేశాడు. వాళ్లు తమకర్తవ్యాన్ని తెగతాగారు. ఇల్లాగ వర్తకుడు వాళ్లచేత మూడుపీపాల సారాయి త్రాగించేసరికి మత్తెక్కి అందరూ గుఱ్ఱుపెట్టి నిద్రపోయారు.

అప్పటికప్పుడే అర్ధరాత్రవ్వచ్చింది. దొంగ ఆలస్యం చెయ్యకుండా తనసోదరుడి మొండాన్ని ఒకగాడిదమీద వేసి తీసుకుపోయాడు.

మరునాడు ఈవిషయం తెలిసిన రాజుగారి ఆగ్రహానికి అంతులేదు. ఆయన ఇంత ధైర్యసాహసాలు తెలివితేటలు గల దొంగని ఎక్కడా చూడలేదు. రాజుగారికి అతని మీద కోపం కొంచెం తగ్గింది.

'ఈపనులన్నీ చేసినవాడు ధైర్యంగా ముందుకు వచ్చినట్లయితే వాడిని క్షమించి నాకూతురు నిచ్చి

(30-వ పేజీ చూడుడు)

బాలానందం :

# ఏ విలువకు, ఆ విలువే!

**చి. యు. మారుతీభట్టు**

అనగా ననగా నొక ఊరు. ఆపూరిలో నొక రాజుగా రుండే వారు. రాజుగారి నౌకరు లనేకులు. వారిలో రామన్న ఒకడు. రామన్న వృత్తిచేత సేద్యగాడు. ఆతని సంసారములో మిగిలినవాడు కొడు కొక్కడే. రామన్న చాల పొదుపుగ జీవిస్తుండేవాడు.

ఎండకాలముగనుక పొలములో పని లేదు. రామన్న తనయింటి సోఫామీద గూర్చుండి వస్తూ పోతూవుండేవారిని గమనిస్తుండడము వాడుక.

ఒక నాటి సాయంత్రము రామన్న కుమారుడు బజారు కెళ్ళి తిరిగియింటికి వచ్చినపు డతని నాయన, 'అబ్బాయీ! బజారులో విశేషము లేవి?' అని అడిగినాడు. కొడుకు:–'నాయనా, బజారులో యేనుగులు అమ్మకానికి వచ్చాయి, చాల చౌకగ చెప్పుతున్నారు. ధర యేమనుకొన్నావు? వక్క–పేడుకు ఒక యేనుగు. నాయనా ఒకటి కొందామా!' అని ఆశతో అడిగాడు.

కాని రామన్న అందులకు సమ్మతించక "ఇప్పటికి వద్దు బాబూ" అని అన్నాడు.

పదిహైదేండ్లు గడచినాయి. మరల బజారులో యేనుగులు కనబడుచున్నాయి. కాపువానికొడుకున కీ సమాచార మెలాగో తెల్సింది. వాడు గబాగబా బజారుకు పరుగెత్తి ధర విచారించాడు. వెయ్యిరూపాయలు కొక్క ఏనుగు అని ఏనుగు యజమాని అన్నాడు. కాపువానికొడు కింటికి వచ్చి నాయనతో అంటున్నాడు–'నాయనా! యేనుగ లమ్మకానికి వచ్చినవి గాని, యేమి ప్రయోజనం? చెడ్డ ప్రియం! వేయిరూపాయ లిచ్చి యేనుగు నెవరు కొంటారు?' అని కుమారుడనగా కాపువాడు,—'అబ్బాయీ! ప్రియమైనా సరే, ఒక యేనుగ కొని తె'మ్మన్నాడు. అప్పుడు కొడు కన్నాడు: 'నాయనా! చౌకగా వస్తున్నపుడు మానుకొని ప్రియంగా కొనడంలో అర్థ మేమిటి?' అని. అందుల కాముసలవాడు—'నాయనా! అప్పుడు చౌకగా ఏనుగును కొన్నా దానిని భరించు శక్తి అప్పటికి లేకుండినది. యీ 15 యేళ్ళలో నాలుగుడబ్బులు సంపాదించుకొన్నాము. రాజుగారిని కనిపెట్టుకొన్నాను; వారు యేనుగుకు పని కల్పిస్తామని మాట యిచ్చినారు. కనుక ప్రియమైనా సరే, యిప్పుడు కొనవలసిందే. మన యింటిముందర గజలక్ష్మి నిలబడి యుండడము కోరి యిన్నాళ్ళు కష్టపడింది.'

గంటసేపులోపల యేనుగును తెచ్చి కుమారు డింటిముందరకట్టి వేశాడు.

కథ కంచికీ, మన మింటికీ.

---

పెళ్ళిచేస్తా' నన్నాడు. దొంగ విషయం ఆలోచించి ధైర్యంగా వెళ్ళాడు.

భటులు అతనిని రాజుగారి దగ్గరికి తీసుకువెళ్లారు.

"ఈపనులన్నీ చేసినవాడివి నువ్వే నన్నమాట" అన్నాడు రాజు.

"అవును. నేనే మహాప్రభూ!" అన్నాడు దొంగ వినయంగా.

"నువ్వు చేసినపనికి నీమొహాం చూపెట్టడానికి నీకు భయం లేదా?" అని ప్రశ్నించాడు రాజు.

"నన్ను క్షమిస్తా నని మీరు వాగ్దానం చేసారు. మీవాగ్దానాన్ని మీరు తా రని నే నెప్పుడు అనుకోను" అన్నాడు ధైర్యంగా.

రాజు అతనిధైర్యానికి మెచ్చుకుని తనకూతుర్నిచ్చి పెళ్ళిచేసి తన రాజ్యంకూడ ఇచ్చాడు.

---

# పట్టువదలని వేళ్లు

(15వ పేజీ తరువాయి)

ఉన్న ఆ విచిత్రవస్తుసంచయాన్న తడు చూస్తూ కూర్చున్నాడు.

తను చేసిన పని తప్పొప్పుల నిర్ణయానికి ప్రయత్నించాడుగాని ఏనిశ్చయానికీ రాలేకపోయాడు. కాళీ చేసేసిన పర్సును అలాగే తెరిచి చేతిలోనే ఉంచుకుని, ముందు అడ్రెస్సుకార్డు నుంచుకునే అరవెనకాల ఉన్న చక్రంలాంటిదాన్ని తిప్పడం మొదలుపెట్టాడు గుండ్రంగా. పదిపదిహేనుసార్లు తిప్పాక గాని ఆచక్రం వెనకపక్క ఉన్న గుండీ కనబడలే దతనికి. అది కనిపించిన వెంటనే దీపం వెలుగులో పర్సును పెట్టి గుండీ విడతీశాడు. చత్రం నోరులా తెరుచుకుని లోపల ఉన్న నోటుకొసలు పైకి చూపింది. లాగి చూడగా నూరురూపాయల నోటు!

అతనికళ్లు జిగేల్మన్నాయి. చెప్పరాని భయం వేసింది. ఒక్కసారి నలువైపుల గాభరాగా తలతిప్పి, మళ్లీ ఒళ్లో ఉన్నవాటివైపు చూశాడు. డబ్బుపోయిన అత నెంత చిక్కుపడిపోతుండాలి పై ఊళ్లో!

ఆలోచనలో నిండి ఉన్న కళ్లు మడత పెట్టిన కాగితంమీద పడ్డాయి. ఆకాగితం మడత విప్పి చూడగా అతని చూపులకు ముందుగా అతుకున రెవెన్యూస్టాంపుమీద ఎవరిదో సంతకం కనిపించింది. మళ్లీ అన్నివైపులకూ చూసి, ఎవరూ లేరని స్థిరపర్చుకుని అది చదివా డతడు—ఎవరో కొంగుహూరులోని వ్యక్తి వ్రాసిఇచ్చిన ప్రోనోటు.

చదివిన పాక ఆకాగితాన్ని ఉండచుట్టి నలిపి చింపివెయ్యబోయిన అతని వేళ్లు అలాగే ఉండిపోయాయి—అనుకున్నపని చెయ్యకుండానే. ఒకనిముష మలా దాన్ని చూస్తూ ఉండిపోయిన అతడు చిరాకు మడతలు సాపుచేసి మామూలుగా మడిచి జేబులో ఉంచుకుని, ఒక్క నిట్టూర్పు విడిచాడు. ఆ మిగిలిన పదార్థాల్లో డబ్బూ ఒక విజిటింగ్ కార్డూ మాత్రమే అతని జేబులోనికి చేరాయి. మిగిలినవా పర్సుతోపాటు దూరంగా చీకటిలోనికి విసరబడ్డాయి.

ఆమర్నా డుదయం పెందలాడే ఒక ఇన్సూర్డు కవరు రిజిస్టర్ చేస్తూన్న పోస్టల్ గుమస్తా తనపనిలో పడి తల పైకెత్తి చూడలేదు గాని, జూసి ఉంటే చిరు చెమటలు నిండిన మొగంతో భయాన్ని సూచించే శివరావుకళ్లు మటుకతని కాశ్చర్యం కలిగించి ఉండేవి—రసీదు నందుకున్నప్పుడు ఆకళ్లల్లో మెరసిన సంతృప్తి ఆనందమూ కనిపెట్టే శక్తి తనకున్నా లేకపోయినా.

పోస్టాఫీసుగేటు దాటి పైకివచ్చి ఆ రసీదూ జేబులో విజిటింగ్ కార్డూ చింపి ముక్కలుచేసి గాలిలో విసిరిన శివరావుకు మనస్సు చాలా తేలికగా తోచింది.

* * *

రెండు నెలలు గడిచిపోయా యిట్టే. యజమానితో చెప్పి సిఫార్సుచేసి మిల్లులో ఉద్యోగ మిప్పించిన విశ్వనాథం "అప్పుగా" పుచ్చుకున్న ఇరవైరూపాయలూ తిరిగి తనకు రాలేదుగాని శివరావుకు లభించిన ఉద్యోగం మటుకు చల్లగా నిలిచిపోయింది—ఎవరో ఆఫీసరుగారు వచ్చి అడిగినప్పుడు రిజిస్టరులోని అంకె గాకుండా అసలుసరుకునిలువ వెల్లడిచేసిన నేరానికి.

మిల్లులో తన నెలాపదిహేనురోజుల శ్రమకు లభించిన ప్రతిఫలం ఇంచుమించుగా పూర్తిగా హరించుకుపోగా, అదేపనిగా మళ్లీ "ఏమిటి చెయ్యడం" అన్న ప్రశ్నకు సమాధానం వెదుకుతూ వెదుకుతూ స్టేషన్ వైపుకు వస్తున్నాడతడు. స్టేషన్ దరిదాపుల్లో తనముందుగా నడుస్తున్న ఇద్దరు పెద్దమనుషుల మాట లతని చెవుల బడి గుండెవడిని హెచ్చించడమూ, వెనకాలే వారి నడకతో సమంగా ఉండేట్లు తన నడకవడిని తగ్గించడమూ చేశాయి.

నల్లకోటుతొడుక్కున్న ఆ ఎడమవైపు పెద్దమనిషి అతడే! అనుమానం లేదు. మొహం కనపడటంలేదుగాని ఆ ఉన్నతం అదీ, అతడే! సందేహం లేదు.

అత నంటున్నాడు—"......అనుకుని కవరు చింపినవెంటనే, ఆప్రోనోటు కళ్లపడి జిల్లయిపోయా ననుకో. కళేబరానికి ప్రాణ మొచ్చినాకూడా అంతాశ్చర్యపడి ఉండను."

రెండో అతడు: "అవును మరి, ఆశ్చర్యం కాదూ? దొంగతనం చేశినవాడు వెధవ కాయితం నా కెందుకని చింపి అవతల పారెయ్యకుండా శ్రమ తీసుకుని మళ్లీ రిజిస్టరుచేసి పంపడం నిజంగా......"

"కాగితమొక టేనా, నూరురూపాయల నోటుకూడా ఉందందులో......"

"ఏమిటే! నూరురూపాయిలనోటూ మళ్లీ పంపేశాడూ! నిజంగా చెప్పొద్దూ మొక్కాలటువంటివాడికి. ఎంతమం దున్నారంటూ వలాటివాళ్లు మన దేశంలో! అం తెందుకు, నేను ఫోర్తుఫారమ్ చదువుతున్నప్పుడు స్కూలునుంచి వొస్తున్నా నొకనాడు. ఒకావిడ అడ్రెస్సు రాసిన కవ రొకటే, అణాకాసొకటే ఇచ్చింది స్టాంపు కొని అంటించి పోస్టులో పడెయ్యమని తినిమాల్తూ......"

"ఆ అణా హరాయించేసుకున్నావా?"

"అ దొకమాటా!"

"నువ్వైతే చిన్నప్పుడలా చేశావుగాని, ఈరోజుల్లో చాలామంది పెద్దవాళ్లూ అలా చెయ్యడానికి జంకరు. ఇతనూ అటువంటివాడు గాదు. కవరుమీది అడ్రెస్సు చూడగా ఎవడో ఆమాత్రి మీమాత్రం చదువుకున్న వాడిలాగే కనిపించాడు."

"ఇటువంటిది జన్మతః వచ్చే సంస్కారమోయ్! చదువువల్ల వచ్చేది కాదు. ఏదో కర్మవశాత్తూ ఇబ్బందుల్లో ఉండి......"

"నిజంగా అత నెవరో తెలుస్తే కళ్లకద్దుకుని అసిస్టెంట్ మేనేజరుగా వేసుకుందును మా కంపెనీలో. అందరూ దొంగ వెధవలే చేరారిప్పుడు నాదగ్గర. అలాంటివాడొక డుంటే నా కెంతో నిశ్చింతగా ఉండును... అదుగో మెయిలు వస్తూనే వచ్చేసిందే. టిక్కెట్లు తెస్తానుండు."

శివరావు టిక్కెట్లగేటు నానుకున్నాడు గట్టిగా ఆ ఇనుపబద్దీలను పట్టుకుని. అసిస్టెంట్ మేనేజరు. తాను అసిస్టెంటు మేనేజరు. !!

ఆ పెద్దమనుషులు టిక్కెట్లకిటికీ నుండి తిరిగి వస్తుండగా గేటుబద్దీలు వదలి వారి కెదురుగా వెళ్లబోయా డతడు. సులభంగా వారికి బుజువు చెయ్యొచ్చు తానే ఆ వ్యక్తి...

ఆగిపోయాయి అతని కాళ్లు తటాలున.

తాను జేబుదొంగ!

జేబుదొంగగా వెల్లడి కావడమూ తాను !!

పట్టుశిథిలిన వేళ్లు అప్రయత్నంగా వెనక్కి మళ్లీ ఆగేటుబద్దీలనే ఆధారం చేసుకున్నాయి.

గట్టిగా కళ్లు మూసుకుని మళ్లీ తెరిచి చూశాడు. వాళ్లు గేటుదాటి లోపలికి వెళ్లి ట్రెయిను ఎక్కుతున్నారు.

ఒక రెండు నిముషాల్లో స్టేషన్ వదలి క్రమ్ముకుంటూన్న చీకట్లలో మాయమైపోయింది మెయిల్. అలాగే నిలబడిపోయాడు శివరావు ఆ గేటుబద్దీ పట్టువదలని వేళ్లతో.

---

# దున్నుకోని భూస్వామి

భూమిసమస్య చర్చకు వచ్చినప్పుడల్లా, ఇతరనినాదాలతో పాటు 'ఊళ్లో ఉండని భూస్వామీ, అమరకపుపద్ధతీ పోవాలి' అనే నినాదం ముఖ్యంగా వింటూ ఉంటాం.

మనదేశపు భూమిసమస్యసందర్భంలో పలువురు ఒక ముఖ్యవిషయాన్ని మరచి పోతున్నారు. అమెరికా, కెనడా, రష్యా దేశాల్లో వ్యవసాయవిధానాన్ని, అమరకపు పద్ధతుల్ని మనస్సులో ఉంచుకొని మన సమస్యలను పరిష్కరించబోతారు. కాని ఇది అసాధ్యం. ఆ నాదేశాల్లో జనాభా తక్కువ, భూమి ఎక్కువ. కాని మన దేశంలో జనాభా ఎక్కువ, భూమి తక్కువ. వ్యవసాయ విధానాలు అమరకవిధానాలు ఈజనాభా, భూమి ప్రమాణంబట్టి ఏర్పడ వలసిందే కాని అన్నిదేశాల్లోనూ ఒకే మాదిరిగా ఉండజాలవు.

తీవ్రమైన సంస్కరణలను వేటిని అమలు పెట్టినా, ఇప్పుడు వ్యవసాయంమీద ఆధార పడుతున్న జనసంఖ్య తగ్గి, నిరుద్యోగుల సంఖ్య హెచ్చక తప్పదు. వీరికి ఉద్యోగ, జీవనవసతులు కల్పించటం త్వరలో సాధ్య మయ్యే పని కాదు.

ఈ సంస్కరణల్లో దున్నని భూస్వాముల రద్దు ఒకటి. ఊళ్లో ఉండకుండా, ఏబస్తీల్లోనో ఉంటూ, ఉద్యోగమో సద్యోగమో చేస్తూ, మళ్లీ ఇటు కౌలు కిచ్చిన భూములద్వారా ఆదాయాన్ని సంపాదిస్తూ ఉండే విధానం మంచిది కాదు. దున్నే వాడిదే భూమి అని అరటాం.

రాష్ట్రప్రభుత్వపు లెక్క ప్రకారం రైతాంగంలో భూమి పూర్తిగా కౌలుకిచ్చి అమరకం చేయించుకుంటున్నవారు 100 కి 14 గురు మాత్రమే. 100 కి 57 గిరు తమ పొలాన్ని తాము దున్నుకొనేవారే. కాబట్టి ఉద్యోగాలలో, సద్యోగాలలో చేస్తూ, గ్రామాల్లో భూమి ఉన్నవారిసంఖ్య చాలా తక్కువ.

అయితే ఈవిధానం, ఇలా ఉన్న భూము లను కౌలు కిచ్చి, ఈభూస్వాములు ఊళ్లు విడిచి ఎందుకు వెళ్లిపోయారు అనే విషయం తెలుసుకోవాలి. రా భూస్వాముల్లో పది, ఇరవై ఎకరాల కెక్కువ ఉన్నవారు చాలా తక్కువమంది. అధికసంఖ్యాకులు పదెకరాలలోపు ఉన్నవారేఅని చెప్పవచ్చు. ఈభూమిపై వచ్చేది జీవికకు చాలకే వీరు ఉన్న ఊరు విడిచి, జీవికకోసం ఊళ్లు పట్టుకొని తిరగటం ఆరంభించారు. అయినప్పటికీ వారి బతుకు అంతంతగానే ఉంది. భూమిపై ఆదాయం, ఉద్యోగపుడబ్బులూ కలిసినా ఎక్కువమంది సంసారాలను ఈద లేకుండా ఉన్నారు.

వీరిసందర్భంలో విధవస్త్రీలసంగతికూడా చెప్పాలి. వీళ్ళకు ఏకొద్దిమందికో తప్ప, ఎక్కువమందికి నాలుగైదు ఎకరాలకంటె ఎక్కువ ఉండదు. వీరికి జీవనాధారం భూమే. ఏఅన్నదమ్ములవద్దనో, లేక ఏచుట్టం దగ్గలో ఉంటూ, ఈ భూమిపై ఆధారపడి ఉంటారు.

కాబట్టి ఈ ఊరువిడిచిన భూస్వాములను

శ్రీ
సహజానందం

రద్దుచెయ్యడమంటే, వాళ్ల ప్రస్తుతఆదాయాల నింకా కుంచించటం అవుతుంది. బస్తీల్లో మధ్యతరగతికి చెందినవారు కచేరీల్లో, కర్మాగారాల్లో ఎక్కువ జీతాల కోసం, గృహవసతులకోసం ఆందోళన జరుపకతప్పదు.

పోనీ ఈరద్దువల్ల రైతులు బాగుపడుతారా అంటే, ఇప్పటి పరిస్థితిబట్టి అదీ కన్పించదు. రైతాంగంలో, భూమిలేకుండా, ఇతరులభూమిని దున్నుకొనేవారు 100 కి 14 గురు. వీరికికూడాసగటున కుటుంబానికినాలుగైదెకరాలకంటె ఎక్కువ కీలులో ఉండదు.

అయితే వ్యవసాయవిధానందృష్ట్యా, భూమి ఊళ్లో ఉండేవారి అధీనంలో ఉంటేనే మంచిది. ఎక్కడో ఉద్యోగం చేసుకుంటూ ఉండేవారికి భూమిపై శ్రద్ధ ఉండదు. దాని మరమ్మతుల సంగతి మనస్సు పట్టించుకోరు. వచ్చే నాలుగుగింజలూ వస్తే చాలు. ఇందుమూలంగా తిండివిషయంలో దేశం దెబ్బతింటుంది.

ఈభూమి ఇప్పుడు చేస్తున్న కౌలుదార్ల అధీనంచేసి, నూతనవ్యవసాయ విధానాలను తృణమాత్రంగా అవలంబించకతప్పదు. కుటుంబానికి నాలుగైదెకరాలచొప్పున ఉంటే, ఆకుటుంబాలు ఎన్నితరాలు గడచినా, వచ్చే ఆదాయం పాతప్రమాణాలకు సరిపోతుంది. కాని ఇప్పటి నవీనజీవనప్రమాణానికి చాలదు. ఆకుటుంబాలకు చదువుసంధ్యలు, మంచి గృహవసతి, వైద్యవసతి ఏర్పడజాలవు. ఇందుకు క్రమేపీ సహకార, సాముదాయిక వ్యవసాయవిధానాలను అమలుజరపాలి. గ్రామాల్లో పెట్టదగిన పరిశ్రమలను విరివిగా స్థాపించాలి.

కాబట్టి మొత్తంమీద ఈ ఊళ్లోఉండని, దున్నుకోని భూమిదారివిధానం పోకతప్పదు. కాని ఈవిధానాన్ని ఎలా రద్దుచెయ్యటం, మళ్లీ కొత్తవిధానాన్ని ఎలాఏర్పరచటం ఇవే ముఖ్యసమస్యలు. రద్దుచేసి, ఇప్పటి లాగానే ఎకరం, రెండెకరాలుచొప్పున ఉండే వ్యవసాయవిధానాన్ని మార్చకపోతే పెద్ద ప్రయోజనం ఉండదు.

రద్దుచెయ్యటంవిషయంలో, దెబ్బతినే వారి ఆర్థికపరిస్థితిని విచారించటం ముఖ్యం. వీరికి తగిన కాంపెన్సేషన్ ఇవ్వటం అవసరం. నిజానికి జమీందార్లకు కంపెన్సేషన్ అనవసరం. ఎందుకంటే వారి కిప్పటికీ స్వంత కమతాలకింద భూమి వందలకొద్దీ, వేలకొద్దీ ఉంది. ఇంత స్వంతభూమి ఉన్న జమీందార్లు జీవించలేని పరిస్థితుల్లో లేరు. కాని పైచెప్పినవారికి ఉన్న కొద్ది ఆదాయమూ రద్దుకాగా, గ్రామాల్లో రైతాంగపు అలజడి, బస్తీల్లో ఉద్యోగస్థుల అలజడీ హెచ్చుతుంది. వీరికి ఉన్న భూమికి తగినప్రమాణంలో కంపెన్సేషన్ ఇచ్చి భూమిని సంఘపరం చేసుకొని, కొత్తవ్యవసాయ విధానాల ప్రకారం వాటిని అమరకం చేయటం తగిన పని.

ఇప్పటి పాతఅమరకపువిధానాలను రద్దు చెయ్యటంతో చాలదు. రద్దుచెయ్యటంతో ఆగితే, చెయ్యవలసిన పని పూర్తికాదు. ఒకరి చేతుల్లోంచి తీసుకొని మరొకరిచేతులకు అప్పగించినంతమాత్రాన చాలదు. కొత్త వ్యవసాయవిధానాలను ఈరద్దు చెయ్యటంతో పాటే ఆరంభించనిదే, రైతూ నిండుగా బాగుపడడు, దేశమూ బాగుపడదు.

# కర్మణి ప్రయోగం



ఒక అభిప్రాయం ఉపయోగపరచడానికి వాక్యాని కొక నిర్మాణం కావాలి. ఒక భావాన్ని స్పష్టంచేయాలంటే వాక్యాని కొకవిధమైన కట్టుదిట్టం అవసరం. కర్మణి ప్రయోగాన్ని ఊతగా తీసికొని, అన్ని భాషలూ లాభాన్ని పొందేయి. అందులోను తెనుగు ప్రత్యేకంగా లాభాన్ని పొందింది. వాక్యానికి సంప్రదాయం. అవసరం, "రాముడొక పిల్లవాడు" అనే వాక్యానికి మరొక భాషాసంప్రదాయం "రాముడొక పిల్లవాడై యున్నాడు." అని గ్రహించాలి. "*Rama is a boy*", 'రామ్ ఏక్ లడ్కా హై' ఈ రెండుభాషల వాక్యనిర్మాణం ఆంధ్ర భాషాసంప్రదాయానికి భిన్నంగా కనిపిస్తున్నది. మన ఉపాధ్యాయులు క్లాసులో పాఠం చెప్తున్నప్పుడు "అనుకరణపద్ధతినే" ఉపయోగించి "*Rama is a boy*" అనే వాక్యానికి "రాముడొక పిల్లవాడై ఉన్నాడు" అన్న వాక్యాన్ని చెప్తారు. ఈవాక్యం విద్యార్థుల మనస్సులో నాటి పరీక్షలలో కూడా అట్టి వాక్యాలే వ్రాస్తారు. ఇట్టి వాక్యనిర్మాణంతో తెనుగుభాష అభివృద్ధి నందలేదు.

ఒకభాష కింకొకభాష ఆదినుండీ భిన్నంగా ఉంటూ వచ్చింది. సజాతీయభాషలైనా, విజాతీయభాషలైనా వాక్యనిర్మాణంలో తేడా తప్పక కనిపిస్తుంది. వాక్యాన్నిబట్టి "ఈభాష ఏభాషనుండి పుట్టినదా?" అని ఊహిస్తాడు భాషాశాస్త్రజ్ఞుడు. భాష ఎప్పుడూ స్వతంత్రమైనదే, దానికి అస్వతంత్రత అంటూ లేదు. ఒకభాషలో నుండే గాంభీర్యంకొలదీ ఆభాషలో వాక్యం నిర్మింపబడుతుంది. వాక్యాన్ని నిర్మించడమంటే భాషాశాస్త్రవేత్తకి ఒక భవనం నిర్మించినంత కష్టంగా ఉంటుంది. మొదటి రోజులలో నన్నయ్యవంటి భాషా కోవిదుడు వాక్యనిర్మాణానికి చాలా భయపడ్డాడు. అప్పటికి కన్నడభాషలో 'పంప, రన్న, పొన్న' అను కవులు భారతాన్ని రచించేరు. తమిళంలో వాఙ్మయం పెరిగింది. తెనుగులో గ్రంథాలు లేవు. వాక్యానికి ప్రాణం పోయాలి. సంప్రదాయాన్ని అతిక్రమించకూడదు. అట్టివిషమస్థితిలో భారతాంధ్రీకరణం జరిగింది. భాషావాదులలో విప్లవం చెలరేగకుండా నారాయణభట్టు నన్నయకు తోడుపడ్డాడు. అయితే, నన్నయ అంతకు ముందు మార్గంమీద పోయేడు. అజ్ఞాతయుగంలో అజ్ఞాతభాషావేత్తల రచనలే లేకపోతే నన్నయభారతం వేరుగా ఉంటుంది—అనడంలో సందేహం లేదు. ఏ మార్గం లేని సమయంలో మహాభారతావిష్కరణ జరగడం అజ్ఞాతభాషావేత్తల త్యాగమహిమ అనవలసి ఉంది. భారతరచననుబట్టి వాక్యనిర్మాణం కాలేదు. వాక్యనిర్మాణాన్ని బట్టే భారతరచన సాగింది.

సంస్కృతభాషాసంప్రదాయం తెనుగుది కాదు. సంస్కృతభాషావాక్యాలు క్రియాఫలగాములు. ఆ భాషాపదాలతో మల్లయుద్ధం చేయవచ్చు. "రామేణ బాణేన హతో వాలీ" "రామేణ రావణో హతః" ఇవి సంస్కృతభాషాసంప్రదాయానికి చెందిన వాక్యాలు.



## శ్రీ ఆదిభట్ల వేంకటరమణ

ఈ వాక్యాలలో కర్మ పనిచేస్తున్నాది. కర్మకి ఉన్న తీవ్రత కర్తకి ఉండదు. కర్మను ప్రధానంగా తీసికొని వ్యాకర్త తన మేధస్సును చూపేడు. కర్మణిప్రయోగంతో వాక్యం శక్తివంతంగా నడుస్తుంది. "గంతవ్యా తే వసతి రలకా నామ యక్షేశ్వరాణాం" ఇట్టి ప్రయోగాలలో కర్తరిప్రయోగం వాడినట్లయితే కవికి ప్రతిభ రాదు: "గంభీరమయిన వాక్యాలలో కర్మ ప్రాధాన్యత్వము గ్రహించకపోతే ఆ వాక్యంలో పునాది చాలదు." అంటారు పెద్దలు.

అయితే ఈ సాంప్రదాయం తెనుగు భాషకి పడదు. తెనుగులో కర్మణిప్రయోగం ఒకవిధంగా ఉంటుంది. "రామేణ హతో రావణః" అనే వాక్యం ఇంగ్లీషులో "*Ravana was killed by Rama*" హిందీలో "రామ్ సే రావణ్ మారా గయా" అని వాడినప్పుడు వాక్యనిర్మాణం సంస్కృతి ఒకే విధంగా ఉన్నాయి. తెనుగులో "రామునిచే రావణుడు చంపబడినవాడాయెను", "నాచేత అయోధ్య పొందబడినది (వెళ్ళబడినది)" అనేది సంప్రదాయం అరిది. సంస్కృతభాషా, కారం తెనుగుపైకి పడినప్పటినుండే తెనుగు వాక్యనిర్మాణం మారిపోయింది. అసలు తెనుగు భాషలో కర్మణిప్రయోగం వేరు. సంస్కృత భాష స్వంతంచేసికొన్న కర్మణిప్రయోగాలు తెనుగులో చాలవరకు కనిపించవు. ఆర్యభాషలలో కర్మణిప్రయోగంలో ఉండే శక్తి ద్రావిడభాషలలో, లేదని నా ఊహ. అలాగే ద్రావిడభాషలలో కర్తరిప్రయోగంలో ఉండే "ఫోర్సు" ఆర్యభాషలలో తక్కువ. అయితే తెనుగుభాషపై సంస్కృతభాషావాదులు తమ స్వార్థంకోసం కొన్ని సాంప్రదాయాలు పులిమివేసేరు.

క్రియలోను, ధాతురూపాల్లోను, కృత్తద్ధిత ప్రత్యయాలలోను, సమాసాలలోను ఒకటేమిటి?—వాక్యానికి ప్రధానాంగాలైన కర్తరికర్మణిప్రయోగాలలో కూడా కృత్రిమ సాంస్కృతికవేషం వేయించి మిడుకిక్కిలి తెనుగొక భాషా? తెనుగు కొక వ్యాకరణమా? అనేవరకూ వచ్చింది. కాలం మారిన తరువాత కూడా "తెనుగున కున్న వ్యాకరణ దీపం చిన్నది" అనడంలో అర్థం లేదు.

ఇంతకీ తెనుగులో కర్మణిప్రయోగం. లేదు ఆర్యభాషలలో వాడుతూ ఉన్న కర్మణి ప్రయోగం లేదు. తెనుగులో క్రొత్తగా "బడు" అనే ధాతువు ఉంది. మన భాషలో కర్మణి ప్రయోగసూచకంగా "బడు" లేకపోతే నిత్య వ్యవహారాల నడ్డుపెట్టవలసి ఉంటుంది. "బడు" ధాతువుతో కూడిన కర్మణిప్రయోగంవల్ల కొన్ని లాభాలు కనిపించేయి. బజారులోనికి వెళ్లి చూస్తే "ఇచ్చట మిఠాయి అమ్మబడును", "ఇచ్చట బట్టలు అమ్మబడును", "తదుపరి కథ తెరపై చూపబడును" అని బోర్డులుంటాయి. పై వాక్యాలలో "అమ్మబడుచున్నది" ఏది? మిఠాయి, బట్టలు, ఈ వాక్యాలను కర్తరి

ప్రయోగంలోనికి మారుస్తే మిఠాయిని అమ్ముగుదుము, బట్టల నమ్ముదుము. తెరుపరికథ తెరపై చూపుదుము. అని వాడవలసి ఉంటుంది. పై వాక్యాలలో కర్తలుగా ఉన్న "మేము" అన్న పదం ప్రజల కవసరం. "మిఠాయి, బట్టలు, కథ" ఇవి ప్రజలకు అవసరం, కాబట్టి "కథ తెరపై చూపబడును" అన్న ప్రయోగంలో చదివెడివానికి పదార్థంమీదకే దృష్టిపోతుంది. ఇది వాడుకతో జరుగుతున్నది. కాని, ఇక్కడ కర్మణి ప్రయోగం వాడాలి అన్న పట్టుదలతో వ్యాపారస్థులు బోర్డులు వ్రాయరుకదా?

తెనుగులో "బడు" ధాతుచరిత్ర నిగూఢమైనది. ఇది సహాయక క్రియ. హిందీభాషలో కూడా "గయా" అనే సహాయక క్రియ బడు ధాతువుగా వాడబడుతూ ఉంది. ఇంగ్లీషులో '-ed' చేర్చగానే "బడు" ధాత్వర్థంసూచింపబడుతుంది. వాక్యంలో స్పందనశక్తి ఉంది. ఆ స్పందనశక్తి వాక్యాన్ని చలింపజేస్తుంది. అప్పుడా చలనంతో వాక్యంలో అనుకొనకుండా నిర్మాణం ఏర్పడుతుంది. ఆ నిర్మాణాన్ని చూసి మానవుడు ముగ్ధుడౌతాడు.

ఈ రెండుసంప్రదాయాల విభిన్నత్వం ఒక్క ఉదాహరణతో స్పష్టంచేయడానికి ప్రయత్నిస్తాను. "వెళ్ళు" అనే ధాతువు తెలుగులో అకర్మకమనే చాలామంది భావిస్తున్నారు. సంస్కృతంలో "కర్మణి ద్వితీయా" అనే సూత్రానుసారం "గల్" ధాతువు క్రియారూపంలో సకర్మకమే అవుతున్నది. "కంసవ్యాతే వసతి రలకా నామ యక్షేశ్వరాణాం" ఈ ప్రయోగము వలన "గమ్" ధాతువు సకర్మకమే అని స్పష్టం. తెనుగులో "నాచే పాఠశాల వెళ్ళబడుచున్నది" అంటున్నామా? సంస్కృతంలో సంప్రదాయం తెనుగులో ప్రవేశింపచేసినట్లైతే ఇట్టి ప్రయోగాలు వాడుకోవాలి. ఇట్టివి



ఇండియన్ నౌకాదళోద్యోగి బి. యస్. వాస్వానీ. వీరిని యిటీవల బ్రిటన్‌లోని ఇండియన్ హైకమిషనరుకు డిప్యూటీ సలహాదారుగా నియమించారు.

పాఠశాలలో తెనుగువిద్యార్థులను మోసగిస్తున్నాయి. ఈ ప్రయోగమే తెనుగుసంప్రదాయం అనుకొంటున్నారు. అట్టి తప్పులు చేయకుండా చేయు బాధ్యత ఉపాధ్యాయునిది. ఈ సంప్రదాయాన్ని బోధ చేయకుండా "కర్త తృతీయావిభక్తిలోను, కర్మ ప్రథమావిభక్తిలోను ఉండి క్రియకు "బడుఅను ధాతువు చేరినచో కర్మణి ప్రయోగ మగును." అన్న సూత్రం చెపితే విద్యార్థి తప్పుత్రోవ త్రొక్కుతాడు. ఈ సూత్రానికి ప్రయోగంగా "నాచే అడవి వెళ్ళబడినది" "అన్నము రామునిచే తినబడినది" అనే ప్రయోగాలు ఉదాహరించితే ఉపాధ్యాయుడు చెప్పిన సూత్రానుసారం ఆ వాక్యంలో తప్పు లేదు. కాని, తెనుగు భాషా సంప్రదాయం విద్యార్థి అర్థంచేసికొనలేక "తెనుగుభాష కేవలం సంస్కృతం మీదనే ఆధారపడింది, దీని కొక స్వతంత్రత లేదని తప్పక తలుస్తాడు. ఈ విధంగా కాకుండా తెనుగులో "కర్మణిప్రయోగం-దాని ఉపయోగం" చెప్పాలి ఇతరభాషల్లో ఈ వాక్యనిర్మాణాన్ని దిఙ్మాత్రంగా ఉదహరించి తెనుగుభాషలో "వాక్యనిర్మాణం= భాషా సౌష్ఠవం" అనే విషయాలు ఉపాధ్యాయుడు మనస్సులో నాటించుకోవాలి. భాషలో ఉండే స్పందనశక్తి విద్యార్థులను స్పందింపచేయలేకపోవటంలో పెద్ద లోపం ఉపాధ్యాయుందే అని నా అభిప్రాయం.

# మన దేశం

(8-వ పేజీ తరువాయి)

వాదప్రతివాదాలకూ మరింత తావిచ్చింది. తిరిగి ఇవన్నీ అనుభవంలో పరీక్షించబడినప్పుడు గాని మన రాజ్యాంగానికీ, మన దేశ రాజకీయ వ్యవస్థకీ నిర్దిష్ట స్వరూపం కలగదు. మన రాజకీయ వ్యవస్థకు ఈరీతిగా స్వరూపం ప్రసాదించవలసినవి సుప్రీం కోర్టు, శాసనసభలు. పరిస్థితులను బెదిరి, హద్దు తెలియక రాజ్యాంగ నియమాలలోని అవకాశాల్ని పురస్కరించుకుని, శాసనసభలు మూలాశయాన్ని ఆదరించకుండా శాసనాలు చేసినట్లయితే, రాజ్యాంగం ప్రజల అనాదరణకు పాత్రాతుంది. ఇది సంభవించకుండా చూడవలసిన బాధ్యత సుప్రీంకోర్టుపైన ఉంటుంది. అందువల్లనే సుప్రీంకోర్టు రాజ్యాంగనియమాల ప్రయోగాన్నే కాకుండా ప్రధానాశయాన్ని కూడా చర్చించి మరీ ధర్మం నిర్ణయిస్తుంది.

రాజ్యాంగనియమాలను నిరూపించడంలో సుప్రీం కోర్టుకు గల అధికారం పరిమితమైనదే నని చీఫ్ జస్టిస్ హరిలాల్ కనైయ్యా గారు తమ తీర్పులో చెప్పారు. శాశ్వతంగా ఏ రాజ్యాంగనియమాలు వర్తించుటలో నిర్ణయించే రాజ్యాంగపరిషత్తుకే తాత్కాలికంగా శాసనాలు చేసే శాసనసభల అధికారాలను నిర్వచించ గల అధికార మున్నది కాని, ఆ అధికారం కోర్టులకు లేదన్నారు. అలాంటి అధికారం కోర్టు కిచ్చినట్లయితే అది నిర్నిబంధం కాగలదు. అంతటి అధికారం వ్యక్తుల్నీ వారి హక్కుల్నీ సరిగా రక్షించలేకపోగా, న్యాయవిచారణ సంస్థలకే ముప్పు తెచ్చిపెట్టగల దని చెప్పారు.

ఈ ప్రకారం ప్రాథమికస్వత్వాలను నిర్బంధశాసనాన్నీ సుప్రీంకోర్టు చర్చించి, గోపాలన్ నిర్బంధం క్రమబద్ధమే ననీ, కాని నిర్బంధశాసనంలోని 14 వ నిబంధన సక్రమం కాదనీ తీర్పు నిచ్చింది. సుప్రీంకోర్టులో ఆరుగురు జడ్జీలూ 14 వ నిబంధన అక్రమమని తీర్పు చెప్పారు. 12 వ నిబంధన సక్రమమైనదే నని నలుగురు జడ్జీలు, అక్రమమైన దని ఇద్దరు జడ్జీలూ తీర్పు నిచ్చారు. గోపాలన్ నిర్బంధించబడినది 12 వ నిబంధన ననుసరించి కాబట్టి, తీర్పు ఫలితంగా అతని ప్రార్థన నిరాకరించబడింది.

దేశరక్షణదృష్ట్యా నిర్బంధితుడైన వ్యక్తి ఏకారణాలవల్ల నిర్బంధించబడినాడో, ఆ కారణాలను కోర్టుకు తెలుప నవసరం లే దని ప్రభుత్వనిర్బంధశాసనంలోని 14 వ నిబంధన. దీనివల్ల రాజ్యాంగనియమాలలోని 22 (5) వ నియమం పాటించ బడిందో లేదో నిర్ధారణ చేసే అవకాశం కోర్టులకు నిరాకరించ బడుతోంది కాబట్టి 14 వ నిబంధన రాజ్యాంగ విరుద్ధమని తీర్పు చెప్పారు. నిర్బంధ శాసనంలో 12 వ నిబంధనలో ఏ న్యాయ సలహా సంఘం పరిశీలనతోనూ నిమిత్తం లేకుండా, ఏయే ఖైదీల్ని ఏపరిస్థితుల్లో మూడు మాసాలకు మించికూడా నిర్బంధంలో ఉంచవచ్చునో వివరించబడింది. ఇది రాజ్యాంగంలోని 22 వ నియమానికి బొత్తిగా విరుద్ధంగా లేకపోయినప్పటికీ, రాజ్యాంగఆశయాలకు అనువైనది కాదని జస్టిస్ ముఖర్జీ అన్నారు. కాని అది రాజ్యాంగ పరిషత్తుచేత ఆమోదించబడినందువల్లా, ఆ నియమానికి ప్రస్తుతనిర్బంధ శాసనంలోని 12 వ నిబంధన ప్రతికూలంగా లేనందువల్ల, ఈనిబంధన ఎంత అరుచిగా ఉన్నప్పటికీ క్రమబద్ధమైనదే నని అంగీకరించక తప్పిందికాదు.

## పత్రికాస్వాతంత్ర్యం *

ఇది గాక చెన్నరాష్ట్ర శాసనసభ ఆమోదించిన శాంతిరక్షణ శాసనంలోని తొమ్మిదో నిబంధనకూడా అక్రమమైనదని మరొక కేసులో సుప్రీంకోర్టు తీర్పు నిచ్చింది. "క్రాస్‌రోడ్స్" అనే బొంబాయి ఇంగ్లీషు వారపత్రికను మద్రాసు ప్రభుత్వం శాంతిరక్షణ చట్టంలోని తొమ్మిదవ నిబంధన ప్రకారం నిషేధించింది. జస్టిస్ ఫజల్ అలీ తప్ప మిగిలిన అయిదుగురు జడ్జీలు ఈనిషేధాజ్ఞ, తొమ్మిదో నిబంధనా రాజ్యాంగ విరుద్ధా లని నిర్ణయించారు.

ఈ తొమ్మిదో నిబంధనప్రకారం ఏపత్రికనైనా సరే నిషేధించగల అధికారాన్ని మద్రాసుప్రభుత్వం తీసుకుంది. పత్రికాస్వాతంత్ర్యం ప్రచారస్వాతంత్ర్యాలకు సంబంధించిన 22 వ రాజ్యాంగనియమానికి ఈప్రభుత్వాధికారం విరుద్ధమైన దని నిర్ణయించబడింది. అంటే మన శాంతిరక్షణ శాసనం అక్రమమైపోయిం దన్నమాట. మళ్లీ మద్రాసుప్రభుత్వం త్వరపడి ఆర్డినెన్సు ఇచ్చో, లేక శాసనసభను సమావేశపరిచో, ఈ శాసనాన్ని సవరణ చెయ్యవలసి ఉంటుం దన్నమాట. ఈశాసనం శాసనసభలో చర్చించబడినప్పుడు ఇంతటి అధికారాన్ని ప్రభుత్వం తీసుకోవడం అక్రమమని అప్పుడే అనేకసభ్యులు హెచ్చరిక చేసినా ప్రభుత్వం పెడచెవిని పెట్టింది. దీనికి ఫలితం శాసనసభకి మళ్లీ పనితగలడం, మళ్లీ ఖజానా నుంచి కొన్ని వేల రూపాయల అదనపు ఖర్చు.

## కాంగ్రెసుఎన్నికల వాయిదా

కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరిజిల్లాల్లో కాంగ్రెస్, పంచాయతీఎన్నికలు వాయిదా పడినాయి. రాబోయే శాసనసభల ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థుల్ని ఎంచే అధికారంకోసం జరిగే పెనుగులాట కొత్త స్థాయిలో పడింది. రిటర్నింగ్ ఆఫీసర్ల నియామకంలో తగువులు, నామినేషన్లు దాఖలు చెయ్యడంలో ఒకర్ని మించి మరొక పోటీలు తొందరపాటు నామినేషన్లని దాఖలా చెయ్యడంతో తృప్తిపడక రిటర్నింగ్ ఆఫీసులికి వెళ్లి నెత్తిని రుద్దడం, అవి రిజిస్టర్ చెయ్యడానికి కొందరు, చేయించకుండా చెయ్యడానికి కొందరూ పందేలు వేసి పరుగులు తియ్యడం. ఆ ఆఫీసులవద్ద వాద్యుద్ధాలు, ముష్టియుద్ధాలు వగైరా, అదును చూసి నామినేషన్ల కట్టలు కొట్టేసి కొందరు దాటెయ్యడం, పోలీసురిపోర్టులు, తాలూకా కాంగ్రెసులు రాష్ట్రకాంగ్రెస్‌కీ, జిల్లా కాంగ్రెస్‌లు అఖిలభారతకాంగ్రెసుకే టెలిగ్రాములమీదా టెలిఫోన్లమీదా ఫిర్యాదులు చెయ్యడం, వీటితో దేశం అట్టుడికికిట్టుడికిపోతోంది.

దేశస్వాతంత్ర్యంకోసం ధీరులూ భీరువులూ, స్వార్థత్యాగులూ స్వార్థపరులూ అందరుకూడా పోరాడానికి స్వాతంత్ర్యం తుదిమెట్టులో అవకాశ మివ్వబడింది. ఇది జాతీయవిప్లవంలో అవసరంకూడా. అయితే ఆ అవసరం తీరిపోయాక కమ్యూనిస్టులైతే నాటికి నాటు సాళ్లు పార్టీమనుషులు

(39 పేజీ చూడుడు)

# విజ్ఞాన విశేషాలు

# అతిశీతల మండలం-ఉష్ణశూన్య ప్రకృతి

మనకి కాస్త జ్వరం వచ్చినప్పుడు నూరు డిగ్రీలు నూటరెండు డిగ్రీలో టెంపరేచరు వచ్చిందంటాం. టెంపరేచరు 96 కి దిగిందంటే శీతలం కమ్ముతోందని నార్మల్ కు తక్కువకు పడిపోతూందని అంటాం. ఇంతకూ మన దేహం ప్రాణంనిలుపుకోగలది మనదేహంలో టెంపరేచరు, 92°, 93° నుంచి 106°, 108° డిగ్రీల మధ్య ఉన్నప్పుడే. ఇది మన దేహంలో టెంపరేచరు విషయం. వాతావరణంవిషయంలో, ఆర్కిటిక్ ప్రదేశాలలో మంచు గడ్డకట్టిన టెంపరేచరుకన్న 40,50 డిగ్రీలు తక్కువైన శీతల వాతావరణంలోనూ మానవుడూ, జీవులూ కూడా బ్రతకగలుగుతున్నాయి. ఇటు సహారాలో ఎండలో ఇసుకమీదే నీళ్లు కాచుకోగల నిప్పులు చెరిగే వాతావరణంలోనూ మానవుడు బ్రతకగలుగుతున్నాడు. అయితే అంతర్యంగా దేహంలో రక్తం, 92-108 డిగ్రీల టెంపరేచర్ల మధ్యన ఉంటేనే మానవుని ప్రాణం నిలిచే ఆస్కారముంది. అందులోనే, 98.4° డిగ్రీలు టెంపరేచరుంటే సామాన్య ఆరోగ్యం. ఒక్క డిగ్రీ అటైనా ఇటైనా జబ్బే.

ఈ టెంపరేచరు 98 డిగ్రీలు అంటే ఏటు నుంచి 98 డిగ్రీలు? దీని మొదలు ఏమిటి— ఇందులో డిగ్రీ అంటే ఎంత అనేవి చిన్న క్లాసుల్లో అయిన ఫిజిక్సు చదువుకొన్నవాళ్లకు తప్ప, తక్కినవాళ్ళకు తబ్సీలుగా తెలియటం కష్టం.

టెంపరేచరు అంటే అంతస్సితంగా, ఉన్న ఉష్ణోగ్రతకు మానము. మన చేతికి చల్లగా తగిలినవి, మన దేహం ఉష్ణోగ్రతలోకన్నా తక్కువ ఉష్ణోగ్రతలో ఉన్నాయనీ, వెచ్చగా తగిలేవి మనదేహంకన్నా ఎక్కువ ఉష్ణోగ్రతలో ఉన్నాయని స్థూలంగా తెలుసికోగలము.

కాని ఇది బండలెక్క. మంచులోనించి తీసిన చెయ్యి మామూలు చన్నీళ్ళలో పెడితే, మామూలుగా గోరువెచ్చగా వుండే నీళ్ళకన్నా వెచ్చన అనిపిస్తాయి ఆ నీళ్ళు. ఇల్లా తారతమ్యంలో యథార్థత దెబ్బతినిపోకుండా శాస్త్రీయంగా ఏపరిస్థితిలో ఉన్న ఏవస్తువుఉష్ణోగ్రతఅయినా తెలిసేందుకు ఒక స్థిరమానం ఏర్పరుచుకోవలసి వచ్చింది. అల్లాంటి స్థిరమానం కావాలంటే ప్రకృతిసిద్ధంగా స్థిరంగా ఉండేవి, ఎప్పటికప్పుడు పరీక్షకు అందుబాటులో ఉండేవి 2 టెంపరేచర్లు నిర్ణయించుకోవలసివచ్చింది. ప్రకృతిలో సామాన్యవాతావరణపరిస్థితుల్లో మంచు నీరుగా మారే ఉష్ణస్థితీ, నీరు ఉడికి ఆవిరిగామారే ఉష్ణస్థితీ, ఈ రెండు టెంపరేచర్లు స్థిరంగా ఉండే టెంపరేచర్లని తెలుసుకొన్నారు. టెంపరేచరు కొలిచేమానం తయారుచేయాలంటే ఈరెండిటిపరిమితులను ఆధారంగా చేసుకొని, తయారుచేసుకోవాలనుకున్నారు. ఇవే ఆధారం చేసికొనే, ఫ్రెంచివారు సెంటిగ్రేడ్ స్కేలూ, (లేబరీటరీలలో ధర్మామీటరు మానము) బ్రిటిష్ వారు, ఫారన్ హీట్ స్కేలూ (మన జ్వరం కొలిచే ధర్మామీటరుమానము) జర్మనీవారు వేపర్ స్కేల్ అని మరోమానము ఉష్ణోగ్రతకు కొలతబద్దలుగా చేసుకొన్నారు.

సెంటిగ్రేడులో, మంచుకరిగే టెంపరేచరకూ, నీరు ఆవిరి అయే టెంపరేచరుకు మధ్య గల ఉష్ణమానాన్ని నూరుభాగాలు చేసి ఒక్కొక్కటి ఒక్కొక్క సెంటిగ్రేడ్ డిగ్రీ అని పేరు పెట్టారు.

ఫారన్ హీట్ స్కేలులో మంచు కరిగే ఉష్ణోగ్రత 32డిగ్రీలు అని నిర్ణయించుకొని, నీరు ఆవిరి అయే ఉష్ణోగ్రత 212° అని నిర్ణయించుకొని ఈ మధ్య నున్న మేరను 187° భాగాలు చేసికొని ఒక్కొక్కభాగం ఒక ఫారన్ హీట్ డిగ్రీ అని నిర్ణయించుకొన్నారు. ఆ లెక్కను 180 ఫారన్‌హీటు డిగ్రీలు 100 సెంటిగ్రేడు డిగ్రీలకు సమానము. అదే కాక, ఫారన్‌హీటులో తీసికొన్న టెంపరేచరును (ఉష్ణోగ్రతను) సెంటిగ్రేడులో మార్చాలంటే, ముందు 32 తీసేసి, 5/9 చేత హెచ్చవేయాలి. ఉదాహరణకు మన దేహం టెంపరేచరు ఫారన్‌హీటులో 98 4° ఉంది కదా. దీన్ని సెంటిగ్రేడులోకి మార్చాలంటె ముందు32తీసేసి, వచ్చిన 66 4 ను 5 చేత హెచ్చవేసి 9 చేత భాగారించాలి. అంటె సెంటిగ్రేడులో మన దేహ ఉష్ణోగ్రత 35 77° లో ఉంటుంది.

ఇదంతా చాలా ప్రాథమికమైన విషయమే. కాని ముందు రాబోయే పదార్థవిజ్ఞానవిశేషాలను అర్థంచేసుకొనడంలో ఇది అంతరాయంగా రాకుండేందుకు కొంచెం వివరంగా చెప్పవలసివచ్చింది.

ఇక్కడే ఇల్లాంటిదే మరో ప్రాథమిక విషయంకూడా చెప్పుకొని, నవీనశాస్త్రపు పోకడల విషయం ముచ్చటించుకొందాం.

మనం పదార్థాలను, ఘనపదార్థాలు ద్రవపదార్థాలూ వాయుపదార్థాలుగా విభజించుకొని నామకరణం చేసుకొంటాం. అంటే మనకు పరిచితమైన వాతావరణపరిస్థితుల్లో ఘనరూపంలో ఉన్న పదార్థాలను ఘనపదార్థాలుగానూ, ద్రవరూపంలో ఉన్నవానిని ద్రవపదార్థాలుగానూ, వాయురూపంలో ఉన్న వానిని వాయుపదార్థాలుగాను భావించి అంచనా వేస్తాం. ఈపదార్థాలను అనువగమైన ఉష్ణపరిస్థితుల్లో ఉంచితే, ఘనపదార్థమే ద్రవరూపమూ, ఇంకా వేడెక్కితే వాయురూపమూ అందుకొంటుందని మనకు పరిచితమే.

(41 పేజీ చూడుడు)

నేటిప్రపంచం

# చీనా భారతదేశాల మైత్రి

పుణ్యాత్ములైనవారు దేహాంతరగతులైన తరవాత స్వర్గానికి వెడతారని హిందువులు విశ్వసిస్తారు. అలాగే చీనాదేశస్థులు పుణ్యాత్ములైనవారు నిర్యాణం చెంది బుద్ధ



మావ్ సి టుంగ్

భగవానుని జన్మభూమి అయిన భారత దేశానికి వెడతారని నమ్ముతారని కమ్యూనిస్టుప్రభుత్వాధిపతి మావ్ సీ టుంగ్ భారత రాయబారి పణికర్ గారితో ఛలోక్తిగా చెప్పాడు. బౌద్ధసిద్ధాంతాలకి మరొక మెట్టు ముందుకు వేసి నాస్తికసిద్ధాంతాన్ని చీనాదేశానికి కట్టబెట్ట సంకల్పించిన నాయకులు అక్కడ పని తీరిపోగానే భారతదేశమే గమ్యస్థానంగా నడక సాగిస్తున్నారనడానికి ఇదొక సూచనగా పాశ్చాత్యులు భావించగలరు. కాని ఉభయులలో ఎవరి మైత్రి కాంక్షించినా ధృతరాష్ట్రపరిష్వంగమే ఫలితం కాగలదని ఆసియాజాతీయవాదుల భీతి.

మావు మీ దేశాన్ని ఆక్రమించుకోవాలనే కోరిక లవలేశమూ లేదుసుమా అని అటు ఆంగ్లోఅమెరికన్ నాయకులంటున్నట్లే ఇటు చీనాకమ్యూనిస్టునాయకుడు మావ్ సిటుంగ్ కూడా స్పష్టంగా పలికాడు. మనవారి భీతి మనదేశాన్ని వారాక్రమించుకుంటారని కాదు. మన దేశంలో పెట్టుబడిబలం కలవారిని ఆంగ్లోఅమెరికన్ ధనికవర్గాలు, కార్మికవర్గాలవారిని రష్యన్‌చీనా కమ్యూనిస్టువర్గాలు కూడగట్టుకుని, వెనక తాము నిల్చి ముందుకు వీరిని నెట్టి దక్షయజ్ఞం ప్రారంభిస్తారని మనజాతీయవాదుల భీతి. ఎంతగా తటస్థంగా ఉండాలని పండిట్ నెహ్రూ ప్రయత్నిస్తున్నప్పటికీ, ఆ తటస్థవిధానాన్ని భంగపరచడానికి ఇటు ఆంగ్లోఅమెరికన్ వర్గం, అటు కమ్యూనిస్టువర్గం ఏకమై దీక్షపట్టాయి. జాతీయవాదం పేరుతో యూరోపియన్ అమెరికన్ వర్గాలపట్ల వైరం సాగిస్తున్నారని మన జాతీయనాయకుల్ని ఆంగ్లో - అమెరికన్ నాయకులు పత్రికలు ప్రచారం చేస్తున్నాయి. మన స్వాతంత్ర్యం స్వాతంత్ర్యం కాదనీ, నెహ్రూప్రభృతులు ట్రూమన్ బేవిన్ల చెప్పుచేతల్లోనివారనీ విదేశకమ్యూనిస్టు పత్రికలు, భారతకమ్యూనిస్టుపార్టీ ప్రచారం చేస్తున్నాయి. కాబట్టి ఈస్థితిలో ఎవరెంత మైత్రీభావం ప్రకటిస్తున్నా అందరినీ భారతజాతీయనాయకులు వెయ్యికళ్ళతో చూడవలసివస్తోంది.

అయితే మావ్ సీటుంగ్ చెప్పినట్లు చీనాభారతదేశాలమధ్య సఖ్యత సహకారం చేకూరినట్లయితే ప్రపంచ శాంతిరక్షణకు బలమైన పునాది ఏర్పడగలమాట నిజం. పాశ్చాత్యులవలె కాక భారతీయులు చీనాదేశస్థులు కూడా ప్రకృతితః శాంతికాములే. అన్యదేశాల సంపదలు దోపిడిచెయ్యాలనే కోరిక వారికెన్నడూ లేదు. ఉభయదేశాల ఆర్థిక, సాంఘిక, రాజకీయసమస్యలు ఒకే తీరుగ ఉన్నాయి. అందువల్ల ఉభయదేశాల మధ్యనూ సహకారానికి అపూర్వమైన అవకాశం రాజకీయస్వాతంత్ర్య సిద్ధితో లభిస్తున్నది. ప్రపంచంలో మూడోవంతు జనాభా ఈ రెండుదేశాల్లోనూ ఉన్నారు. తమ తమ రాజ్యాంగ, ఆర్థిక వ్యవస్థా స్వరూపాల వ్యత్యాసాలతో ప్రమేయం లేకుండా అన్నిరంగాలలోనూ సహకారాన్ని సాధించగలిగినట్లయితే అన్యదేశాల దౌర్భాగ్యమే, తమ భాగ్యంగా రాజకీయతంత్రాలు నెరపుతున్న ట్రూమన్, ఎచిసన్, బెవిన్, చర్చిల్ ప్రభృతుల నోరు కట్టేసి, ప్రపంచ వ్యవహారాన్ని శాసించగల బలం ఈ ఉభయ దేశాలకీ లభిస్తుంది.

ఇంతవరకూ ఒక శుభసూచన కనిపిస్తుంది. అంతర్జాతీయవ్యవహారాల్లో భారతదేశాన్ని విమర్శించవలసిన అగత్యం చీనా కమ్యూనిస్టు ప్రభుత్వాని కింతవరకూ రాలేదు. బ్రిటిష్ ప్రభుత్వం చీనాలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించినప్పటికీ, ఐక్యరాజ్య సమి



సర్దార్ పణికర్

తిలో ప్రవేశపెట్టవలసిన ప్రశ్న వచ్చేసరికి ఆటంకాలు పెట్టడంలో అమెరికాకు తోడయింది. ఎలాగైనా చీనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టాలని భారత ప్రభుత్వం చేసిన కృషిని బ్రిటన్ - అమెరికాలు విఫల మొనర్చినాయి.

చివరికి పరిస్థితులకి బ్రిటన్ ఒడంబడిక తప్పదు. పెకింగ్ ప్రభుత్వాన్ని సమితిలో ప్రవేశపెట్టడం తమ లక్ష్యమని బెవిన్ బ్రిటిష్ పార్లమెంటులో ఈ వారం ప్రకటించాడు.

భద్రతామండలిలో ఈ సమస్యవచ్చినప్పుడు

సుముఖంగా ఓటుచెయ్యకపోయినా వీటో ప్రయోగించబోరని అమెరికన్ ప్రభుత్వం వాగ్దానమిచ్చింది. ఈ వాగ్దానాన్ని పురస్కరించుకొని, సమితి ప్రధానకార్యదర్శి ట్రిగ్వేలీ మాస్కోకు రాయబారం వెళ్లాడు. రాయబార విషయమేమిటో, ఫలితమేమయిందో తెలపలేదు కాని, ట్రిగ్వేలీ తిరిగి లేక్ సక్సెస్ చేరగానే ఆశాభావంమాత్రం ప్రకటించాడు. "కొద్ది మాసాల్లో ఫలితం దానంతటదే వ్యక్తమవుతుంది" అన్నాడు. దీనికి అమెరికన్ పత్రికా విలేఖరులు ఒక అర్థం సూచించారు. మళ్లీ సమితిసర్వసభ్యసమావేశం జరిగేలోగా (1950 సెప్టెంబర్ లోగా) ఫార్మోజాను కూడా కమ్యూనిస్టులాక్రమించుకోగలరనీ, అప్పుడు పూర్తిగా స్థానభ్రష్టత్వం పొందిన చియాంగ్ కైషేక్ ప్రభుత్వానికి సమితిలో సభ్యత్వం ఊడిపోతుందనీ, అప్పుడు ఆ ప్రభుత్వప్రతినిధి వీటో ప్రయోగించే వీలుకూడా పోతుందనీ, ఆవిశ్వాసంతోనే ట్రిగ్వేలీ చీనా సభ్యత్వ సమస్య పరిష్కారం కాగలదని భావిస్తున్నాడని వ్యాఖ్యానించారు. ఈ లోగా అయితే ఉభయులికీ స్థానం ఇవ్వవలసిన ఆగత్యం కలుగవచ్చును. అప్పుడా భయం కూడా ఉండదు.

ఏరీతిగా గాని కమ్యూనిస్టుచీనాకు సభ్యత్వం లభించినట్లయితే తిరిగి ఐక్యరాజ్య సమితి ఎప్పటిమాదిరిగా పనిచెయ్యగలుగుతుంది. లేనిపక్షంలో సమితి కార్యకలాపాలు ఆంగ్లో - అమెరికన్ వర్గం కట్టే నాటకమై ఊరుకుంటుంది. కమ్యూనిస్టువర్గం నిష్క్రమించినందువల్లనే ప్రపంచ ఆరోగ్యసంస్థలో బావ్ డాయ్ ప్రభుత్వానికీ (వియత్ నామ్), లావోస్, కాంబోడియా కీలుబొమ్మప్రభుత్వాలకీకూడా సభ్యత్వాలు లభించాయి.

## శాంతిసమరం *

ఇంతవరకూ జరిగిన ప్రపంచయుద్ధాలన్నిటిలోనూ, శాంతికోసం జరిగినవే నని విజేతలంటున్నారు. ఇది కేవలం ప్రచారమే కాని శాంతికోసం జరిగినవి కావనే సంగతి ఎప్పటికప్పుడు తేలిపోతూనే వుంది. ఇప్పుడు రష్యా, చీనా, తూర్పుయూరోపియన్ దేశాలు ప్రపంచంలో శాంతిని స్థాపించడం కోసం, అన్నిదేశాల ప్రజాసమూహాల తోడ్పాటుతో యుద్ధోన్మాదుల్ని అణచడానికి "ఉద్యమం" ప్రారంభించారు. అయితే ఈ "శాంతిసమరం" పద్ధతి వేరు.

దేశాలన్నిటికీ ఆయుధాలిచ్చి బలపరచి తమ ఆయుధోత్పత్తిని అనేకరెట్లు పెంచి యుద్ధాన్ని తెచ్చిపెట్టడానికి అమెరికా ప్రయత్నిస్తోందని రష్యావర్గం ప్రచారం చేస్తోంది. అన్నిదేశాల్లోను కమ్యూనిజం పేరుతో అరాచకం, విద్రోహం ప్రోత్సాహపరిచి విప్లవాలద్వారా కమ్యూనిస్టుపార్టీల వల్ల అన్నిదేశాలను రష్యా ఆక్రమించుకో చూస్తున్నదని అమెరికన్ వర్గం అంటున్నారు. తనతో కలిసివచ్చే దేశాలన్నిటినీ చేర్చి అమెరికా ప్రత్యక్షయుద్ధానికి సిద్ధపడుతోంది. ప్రత్యక్షయుద్ధం సంభవించకుండా ఆదేశాల్లో విప్లవాలు తీసుకు రావడానికి రష్యా ప్రయత్నిస్తోంది. యుద్ధానికి సిద్ధంగా



ట్రిగ్వే-లీ

ఉండేటట్లని ప్రతికక్షులు యుద్ధానికి దిగాలనే భావం మానుకోగని అమెరికా ప్రభుత్వాధిపతి ట్రూమన్ అన్నాడు. ఈ సన్నాహాలన్నీ బెర్లిన్ పరదవలసినవి ప్రజలని కమ్యూనిస్టు వర్గ నాయకులు చెప్తున్నారు. వాస్తవానికి ఉభయులూ యుద్ధానికే సిద్ధమౌతున్నారు, అమెరికా చేసే యత్నాలు ఓపెంబడికలు యుద్ధయత్నాలైనాయి. రష్యా చేసే యత్నాలు విప్లవ ప్రచారం శాంతిసమరమయింది.

ఐక్యరాజ్య సమితివారి ఆర్థిక సాంఘిక సాంస్కృతిక వ్యవహారసంస్థలో ఉపన్యసిస్తూ భారతప్రతినిధి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణగారు ఉభయవర్గాల యత్నాలనూ విమర్శించారు. ప్రపంచరాజకీయ పరిస్థితులీరీతిగా ఉన్నందువల్ల ప్రజలపై పరిపాలకుల అధికారిక పీడన, విద్యాదివిషయాలపై ప్రభుత్వనిర్బంధ ప్రచారాలు మొదలైనవి మానవవికాసాన్నీ వ్యక్తిగతాధికారాలనూ నష్టపరుస్తున్నవని రాధాకృష్ణగారు చెప్పారు. ఆసియా ఆఫ్రికాలలో దుర్భిక్షాన్ని నివారించకపోయినట్లయితే సంపత్సమృద్ధమైన పాశ్చాత్యదేశాలకు త్వరలో ముప్పు తప్పదన్నారు. ఆసియా ఆఫ్రికావాసులు దారిద్ర్యంలో కుమిలిపోతున్నప్పుడు పాశ్చాత్యులు యుద్ధయత్నాలకే తమ సర్వసంపదల్నీ వినియోగించడంవల్ల అందరికీ నష్టమే కాని ఏ ఒక్కరికీ ప్రయోజనం కలగదు.

ఈ హెచ్చరిక ముఖ్యంగా ఆంగ్లో-అమెరికన్-వర్గాన్ని ఉద్దేశించి ఇవ్వబడింది. ఆసియా వాసులకు కమ్యూనిస్టులు దారిద్ర్య నివారణ, రాజకీయ దాస్య విముక్తి ఇవ్వజూపుతున్నారు. కాని ఆంగ్లో - అమెరికన్ వర్గం నిత్యమూ ఈదేశాల్ని వెనకబడినవనీ ఈదేశాలవారు తమకి తామై ఉద్ధరించుకోలేరనీ, వారు తమ శరణు పొందక తప్పదనీ, లేకపోతే ఈదేశాలు నరకం పాలు కాక (కమ్యూనిజంలో పడిపోవడం అన్నమాట) తప్పదనీ అంటున్నారు తమ ఆర్థిక ప్రాబల్యం లేనిదే ఈదేశవాసుల దారిద్ర్యం పోదనీ తమ పక్షాన చేరి తమకు విమాన కేంద్రాలు, ఓడరేవులు, సైనికకేంద్రాలు ఇవ్వకపోతే ఈదేశాలపైకి శత్రువులు దండెత్తివచ్చి ఆక్రమించుకుంటారనీ బెదిరిస్తున్నారు.

కాబట్టి ఈ పరిస్థితిలో అంగ్లో-అమెరికన్ వర్గం తన వైఖరి మార్చుకుంటే గాని, ఆసియా దేశాల మైత్రి సహకారాలను వారు సాధించలేరు. ఆసియా దేశాలవారు తనువద్దకు [illegible] కాక మిత్రులుగా రావాలని కోరినట్లయితే అమెరికా ఈపద్ధతి నవలంబించి ఉండదు. [స్వీ… …]

## మన దేశం

(35-వ పేజీతరువాయి)

కానివాళ్ళని ఏరిపారేస్తారు. కాని మన కాంగ్రెస్ వాస్తవంగా దీక్షాపరులైనవారిని ఏరిపారెయ్యలేదు; కాని వాళ్ళ నోరు నొక్కేసింది. కాంగ్రెస్‌లో దొరలకీ దొంగలకీ కూడా చోటు దొరికింది. ఎవరి పని వారు నిశ్చింతగా చేసుకోడానికి తావిచ్చింది. ఎవరివృత్తిని వారు అనుసరిస్తున్నారు. దొరలు చేసే పని దొంగతనంలాగా, దొంగలు చేసే పని దొరతనంలాగా కనిపించడానికి కూడా వీలయింది.

ఈ కలగాపులగంవల్ల కాంగ్రెస్ రాజకీయాల కొక స్వరూప మనేది లేకుండా పోయింది. ఆర్థికవ్యవహారాలలో ఒక దారి కాదు; అన్ని దిక్కులకీ అందరూ లాగుతున్నారు. సోషలిస్టువిధానం మొదలు అరాచక విధానంసహా మోసవ్యాపారంవరకూ కాంగ్రెస్ [illegible] పోయింది. ఆచరణలో ఇదమిత్థ మని నిర్ణయించలేకపోయిన కార్యక్రమాలకి ఎవరు ఎలాంటి అర్థం తీసినా కాదనగలవారెవరు? రంగాగారిని కళావెంకట్రావుగారు దూషించినా, వెంకట్రావుగార్ని రంగాగారు దూషించినా రాజనీతికిందే జమవుతోంది. వైషమ్యాలు రెచ్చగొట్టినా సభ్యతాప్రచారంకిందికే లెక్కకు వస్తోంది. అందువల్లనే కాగితాల దొంగతనాలు, ముష్టియుద్ధాలు, కొట్లాటలు కాంగ్రెస్ రాజకీయాలకింద చలామణి అవుతున్నాయి

ఆంధ్రదేశంలో ఉభయ గోదావరి కృష్ణా గుంటూరు విశాఖ జిల్లాలే ఏవర్గం బలాన్నైనా నిర్ణయించగలిగేవి. కాబట్టి ఈజిల్లాల్లోనే అల్లరు ఫిర్యాదులు మిగతా జిల్లాలలో కంటె అధికమైనాయి. పశ్చిమగోదావరి తూర్పుకృష్ణాజిల్లాల్లో తమ వర్గానికి అన్యాయం జరుగుతోందని రంగాగారు ఢిల్లీకి ఫిర్యాదుచేస్తే, అక్కడనించి వెంకట్రావుగారు ఈ రెండు జిల్లాలే కాక పశ్చిమ కృష్ణా, గుంటూరు జిల్లాల్లో కూడా ఎన్నికల్ని ఆపుచేయించారు.

ఈ ఎన్నికల ముమ్మరంలో తమ సేవాదళాల్ని ప్రయోగించడానికి రంగావర్గంవారు ప్రయత్నిస్తే, వీరి పైకి చిట్టిగారి దళాలు చంద్రమౌళిగారి దళాలు బయలుదేరాయి. ఇంతతో చాల దన్నట్టు కమ్యూనిస్టుల్ని విడుదలచేసి మంత్రివర్గపక్షంవారు దేశంమీదికి విడిచిపెడుతున్నారు రంగాగారి వర్గం. మిగతా రాష్ట్రాలపని పూర్తిచేసుకువచ్చి ఈప్రాంతాల పని చూడ్డానికి వెంకట్రావుగారికి వీలు పడింది.

ఈలోగా ఆంధ్రదేశంనుంచి ఢిల్లీకి ధారాపాతంగా వెళ్ళిపడుతున్న ఫిర్యాదులన్నిటినీ విచారణ చెయ్యడానికి కేంద్ర కాంగ్రెస్ కార్యవర్గంలోని రాజాస్థాన సభ్యులు గోకుల్బాయ్ భట్ గారిని పంపుతున్నారు. [సీతారామ్]



మే 12-న గొల్లలమామిడాడలో మహాత్మాగాంధీ, కీ॥ శే॥ మండ సూరన్నగార్ల ప్రతిమల ఆవిష్కరణ సందర్భమున తీసిన ఛాయాచిత్రము. మధ్యకుర్చీలలో కూర్చున్నవారు కుడినుండి 4, డా. ఎ. పట్టాభిరామారెడ్డిగారు. 5. 6 జి. యస్. వి. రావు, కరుణమ్మ దంపతులు, కర్రి సీతారామారెడ్డి, మండరాజయ్య జీవదయామండలి గౌరవకార్యదర్శి కర్రి అప్పారెడ్డి ప్రభృతులు కలరు.

# విజ్ఞానవిశేషాలు

(36-వ పేజీ తరువాయి)

అల్లాగే, మన మెరిసున్న వాయుపదార్థాల టెంపరేచరును తగ్గించుకొంటూ పోతే, పోగా పోగా ద్రవపదార్థాలూ, ఇంకా శీతలమొనరిస్తే ఘనపదార్థాలూ కూడా అవగల వనేది, ఇందాకటివిషయమంత సామాన్యం గానూ, మనహేతుకంగా మనకు తోచవలసిన విషయమైనా కొంత వింతగా కనబడుతుంది. కారణ మేమిటంటే, మనకు ఘనపదార్థాలుగా కనపడేవాట్లల్లో ఎక్కువ పదార్థాలు, వేడికి కరగి ద్రవమవటం. ఇంకా వేడిచేస్తే వాయురూపంలో రావటం, చాలా వాట్లవిషయంలో మనకు పరిచయమే. కాని మనకు కనబడే గాలిని తగినంతగా చల్లబడేసి, ద్రవరూపంలోనూ, ఘనరూపంలోనూ చూడడం, మనకు సామాన్యంగా లభ్యమయ్యే విషయం కాదు. అందుకని ఊహకు అందుబాటైనా, శాస్త్రపరిశోధనాలయాల్లో చూస్తేతప్ప ప్రత్యక్షంగా ఈ జ్ఞానం మనకు మనోగతం కాదు.

నీరు మంచుగడ్డగా కట్టే శీతలపరిస్థితి మనకు పరిచితమే. ఇంతకన్నా తక్కువ టెంపరేచర్లు అందుకోటానికి రెండుమూడు శతాబ్దాల పూర్వం నుంచీ కూడా శాస్త్రజ్ఞులు పరిశోధనలు చేస్తూనే ఉన్నారు. అల్లా పరిశోధనలు చేసుకొంటూ రాగా, ఈశీతలపరిస్థితులను కల్పించుకొంటూ తక్కువ టెంపరేచర్లను అందుకొంటూ రావటం ప్రత్యేకశాస్త్రమయింది వాయువులను ద్రవరూపంలోనూ ఘనరూపంలోనూ తయారుచేసుకొంటూ అతిశీతలటెంపరేచర్లు అందుకొంటూ రాగలిగారు

టెంపరేచరుమానం సృష్టించిన ఫారన్‌హీట్, మంచులో ఉప్పు కలిపితే టెంపరేచరు మరికొన్ని డిగ్రీలు తగ్గుతుందని కనుగొన్నాడు అల్లా మంచులో వివిధలవణాలు కలుపుకొంటూ కొంతవరకూ శీతలపరిస్థితులు వృద్ధిచేసుకొంటూ వచ్చారు కాని వాయువులను ద్రవరూపంలోకి పూర్తిగా తెచ్చే పరిస్థితులు రాలేదు క్లోరిన్ లాంటి వాయుపదార్థాలు మాత్రమే ఈమాత్రం శీతలపరిస్థితిలో ద్రవరూపంలో తయారుచేసేందుకు వీలుకలిగింది.

కాని ఆతర్వాత ఉష్ణశాస్త్రతత్వపరిశోధనలవల్లా, వాయుపదార్థతత్వపరిశోధనలవల్లా, తక్కువ టెంపరేచర్లు అందుకోటం అంతకంతకూ సాధ్యమయింది. వాయువు ద్రవరూపం అందుకోవలసిన సాధారణశీతలపుస్థితికి రాకపోయినా, వాయుపీడనాన్ని అధికంగా వృద్ధిచేయటంవల్ల, ఇంకా త్వరలోనే వాయువులను ద్రవాలుగా చేయవచ్చునని శాస్త్రం చూపింది. అయితే, దీనికి కూడా *Critical Pressure*, అని ఒక పరిమితి ఉంది. పీడనంద్వారా, అల్లా వీలైన వాయువులను ద్రవరూపంలోకి మార్చాక, ఆద్రవాన్ని మళ్లీ వాయువుగా ఆరనిచ్చేవారు. అల్లా ఆరినప్పుడు, వేసవికాలంలో కుండలో నీళ్లు చల్లబడినట్లు, వాయువుగా మారుతున్న ద్రవం, మరింత చల్లబడుతూ వస్తుంది. అంటే ఇందాకటి కన్న మరికొంత శీతలపరిస్థితికి, తక్కువ టెంపరేచరు రావటానికి ప్రయోగంలో వీలు కలుగుతుంది. కొంతతక్కువ టెంపరేచరుకు వచ్చి, అక్కడనుంచి ఒక అంచగా మరికొంత తక్కువ టెంపరేచరుకు వచ్చేందుకు అవకాశం కల్గింది.

ఇల్లా అధికపీడనంవల్ల ఒకవాయువును అదే స్థితిలో ద్రవంగాతయారు చేసి, దాన్నిత్వరగా ఆరిపోనిస్తే టెంపరేచరు తక్కువౌతూ వస్తూండే ప్రయోగంలో ఒక శాస్త్రజ్ఞుడు ఒకనాడు అధికపీడనస్థితిలో ఉన్న వాయువు ద్రవరూపం అందుకోకముందే, ఒక పంపు మూత తిప్పేందుకు పొరపాటున మరో పంపు మూత తిప్పాడు. అల్లా హఠాత్తుగా వాయువు వెలువడి పీడనం తగ్గినప్పుడు, లోపలి టెంపరేచరు ఒక్కసారిగా నలభైడిగ్రీలదాకా తగ్గిపోయి పడిపోయింది. ఒక వాయువును అధికపీడనస్థితిలో నుంచి అకస్మాత్తుగా పీడన తగ్గించి, ఒక తక్కువ టెంపరేచరు అందుకోవటం, మళ్లీ ఆటెంపరేచరులో ఇల్లాగే వాయువును అధికపీడనలో ఉంచి అకస్మాత్తుగా పీడను తగ్గించి, ఇంకా తక్కువటెంపరేచరు అందుకోవటం ఇల్లా అంచెలు అంచెలుగా అంతకంతకూ తక్కువటెంపరేచర్లకు పోవచ్చునని తెలుసుకొని ప్రయోగాలు సాగించారు. ఈ సూత్ర అధారంమీదే, నేడు మనకు మంచుగడ్డ తయారుచేసే యంత్రాలు, వస్తువులను శీతలంగా ఉంచే ఫ్రిజిడేయరుయంత్రాలూ తయారయాయి ఇల్లా శీతలం చేసుకుంటూ పోగా పోగా ఎంత శీతలటెంపరేచరు వరకూ పోవచ్చునూ అని తాత్వికంగా ఆలోచించారు. శాస్త్రవిజ్ఞానవిశేషాలను బట్టి, మంచు తయారయే 0° సెంటిగ్రేడు టెంపరేచరునుంచి 273 డిగ్రీలు తక్కువైన శీతలపు టెంపరేచరుకన్నా తక్కువ టెంపరేచరు ప్రకృతిలో ఉండటానికి వీలులేదని తెలిసింది. ఈ టెంపరేచరును "అబ్సల్యూట్ జీరో" అని పేరు పెట్టారు ఇంత శీతల టెంపరేచరూ, ప్రయోగాలలో కల్పించేందుకు ప్రయత్నాలు చేశారు. గాలిలోని, ప్రాణవాయువును, నత్రజనిని కూడా ద్రవాలుగానూ, ఘనపదార్థాలుగానూ కూడా తయారుచేయ గలిగారు. కాని అబ్సల్యూట్ జీరోకి ఒక్క డిగ్రీఎక్కువలోకి మాత్రమే రాగలిగారు. ఈ 272 డిగ్రీలు, తగ్గించ్చిన శ్రమ అంతటి మొత్తం కన్నా ఈ ఒక్క డిగ్రీ తగ్గించేందుకు పడవలసిన శ్రమ పదింతలుగా కనబడ్డది. ఈముందు అవలంబించిన పద్ధతులు, ఇంక తక్కువ టెంపరేచరు తయారు చేసేందుకు ఉపకరించకపోయాయి. హీలియం అనే వాయువు ద్రవంగా తయారుచేసేందుకు, దాదాపు — 272° దాకా వెళ్ళగలిగారు. అయితే కొత్త మాగ్నటిక్ విధానాలు, ఉపయోగించవలసి వచ్చింది. హీలియంను ద్రవంగా చెయ్యగలిగారు అబ్సల్యూట్ జీరోకు ఒక డిగ్రీ దరిదాపులవరకూ గల టెంపరేచర్ల శీతలస్థితులను లేబరేటరిలో కల్పించగలిగారు, ఈశీతల పరిస్థితిలో పదార్థతత్వాన్ని. ముఖ్యంగా హీలియం అనే ద్రవపువిచిత్ర తత్వాన్ని ముందువ్యాసంలో తెలిసికొందాం

---

# వార్తాచిత్రాలు



బిర్లాభవనంలో బొంబాయి బాలసంఘానికి (బాల్కాంజీబారీ) చెందిన 200 మంది బాలబాలికలు సర్దార్ పటేలునుచూడ బొంబాయి వచ్చారు.



గౌతమబుద్ధుని ప్రధానశిష్యులైన సారీపుత్ర, మొగ్గలాయనుల అస్థినిక్షేపాలు కలకత్తానుంచి ఢిల్లీచేరనై. వీటిని లెహ్‌కు తీసుకువెడుతున్నారు.

Regd. No. M. **4479**



**Edited, Printed & Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras.**